# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్ళు తోము కొనుట వల్ల దంత శాస్త్ర చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి! కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచి కూడా— కాల్గేట్‌తో సక్రమంగా పళ్ళు తోముకోవటం పిల్లలకు చాలా ఇష్టం.




మీకు పొడరు కావాలంటే, ఈ ప్రయోజనాలన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడరు వల్ల పొందండి... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది!




ఇప్పుడు! సూపర్ సైజు కొని ...డబ్బు పొదుపు చేయండి!

శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతరటూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TL

"సంక్రాంతి శుభాకాంక్షలు!"

## బంగారు కవరింగ్

# రాజా

NO. 41/1 Rs. 4-50

BALLS BENGAL EAR RINGS

RAJA. 41/2 Rs. 4-00 PAIR

RAJA. 508/5 Rs. 26-00

ఆభరణములు ధరించండి.

RAJA. 1421 Rs. 4-00 PAIR

RAJA. 1422 Rs. 4-00 PAIR

SPECIAL STONE RING Rs. 10-00

94/17 RAJA

DESIGN EAR RINGS BIG SIZE Rs. 3-00 MEDIUM Rs. 2-50 SMALL Rs. 2-00 PER PAIR.

RAJA 273

RAJA 290

2-4 SIZE Rs. 10-00 — 2-2 SIZE Rs. 9-00 PER PAIR

**రాజాగోల్డుకవరింగ్ వర్క్స్** (REGD) POST BOX No. 38. H.O. మచిలీపట్నం.

బ్రాంచీలు - గవర్నరుపేట విజయవాడ 2 - మెయిన్‌బజారు ఏలూరు - చిక్కడపల్లి హైదరాబాద్ 20

---

# Ensure Your Success

With

**GLOBE**

ACCURACY

A KASHYAP PRODUCT




Other Famous Brands of Geometry Boxes by **KASHYAPS**

**DELTA, KOH-I-NOOR, HORSE**

KARAN

Mfg **G. S. KASHYAP & SONS** Pataudi House, Darya Ganj, Delhi-6




YOUR FAVOURITE SATHE PICNIC BISCUITS

Now available in fancy air-tight carton



SATHE BISCUIT & CHOCOLATE CO. LTD., POONA-2

# శాశ్వత శాంతికి పసిపాపలే నాంది



నిజమైన శాంతిని సాధించాలంటే, యుద్ధాలను నిర్మూలించాలంటే, మన కార్యక్రమం పసిపాపలతో మొదలుబెట్టాలి. వారు తమ సహజమైన అమాయకత్వంతో పెరిగారంటే........ ప్రేమనుండి ప్రేమకు, శాంతి నుండి శాంతికి మనం పయనించగలము. ఏ శాంతికై, ఏ ప్రేమకై, ప్రపంచమంతా ఆకలిగొన్నారో ఆ శాంతినీ, ఆ ప్రేమనూ ప్రపంచములోని మూల మూలలకూ వ్యాపింప జేయగలము.



మహాత్మా గాంధీ



MAHATMA
GANDHI
BIRTH CENTENARY
OCT. 2, 1968 TO
FEB. 22, 1970
महात्मा
गांधी
जन्म शताब्दी
अक्तूबर 2, 1968 से
फरवरी 22, 1970

davp 69/295

ఆహా !




ప్యారీస్
మిఠాయిలు
వాటి రుచే
రుచి !





# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్

ఆఖరిసారి బట్టలు జాడించడానికి ముందు కాస్త టినోపాల్ వేయండి.

మరి చూడండి. మీ తెల్ల బట్టలన్నీ మిరుమిట్లు గొలిపేలా మెరుస్తాయి— షర్టులు, చీరెలు, దుప్పట్లు, తువ్వాళ్లు.

ఈ అదనపు తెల్లదనం మూలంగా మీకు ఖర్చు ఎంతో ? ఒక బట్టకు ఒక పైసా కూడా కాదు. టినోపాల్ శాస్త్రీయంగా తయారుచేయబడిన తెల్లదనమునిచ్చే తయారు. ఇది బట్టలకు ఏ విధంగామా హాని చేయదు.

టినోపాల్ యొక్క ఇతర ప్యాకులు:



'డబ్బీకి సరిపోయే పొట్లము'



క్రొత్త మితవ్యయ ప్యాక్



® టినోపాల్ జె. ఆర్. గైగి ఎస్.ఎ. బాల్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు
సుహృద్ గైగి లిమిటెడ్. పి. ఒ. బాక్స్ 965, బొంబాయి 1 బిఆర్

Shilpi S.G IA/68 Tel



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలోని "యుగధర్మం" [బేతాళ కథ]కు ఆధారం సి. కె. ఆనందరాజ్ అనేవారు పంపిన కథ. అకారణంగా శిక్ష పొందటానికి యుగ ధర్మం కూడా కారణభూతమవుతుందని ఈ కథ మనకు బోధిస్తుంది. "కష్టార్జితం" అన్న కథలో కూడా చక్కని నీతి ఉన్నది. కొంచెమే అయినా, స్వశక్తితో సంపాదించటమే పురుషలక్షణం. అలాటి వాడికే డబ్బు పట్ల తగినంత లక్ష్యం కూడా ఉంటుంది. ఈ సంచికతో "భారతచరిత్ర" ముగుస్తున్నది.

సంపుటి 44 జనవరి '69 సంచిక 1





# భారత చరిత్ర



ఢిల్లీ తిరుగుబాటుదార్ల అధీనం అయాక మూడు వారాలపాటు అలజడి లేదు. కాని బ్రిటిషువారు ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకునే ప్రయత్నం ప్రారంభించేలోగా (1857 జూన్ మొదటి వారంలో) గంగ ఎగువనగల రాష్ట్రాలన్నిటా — రాజపుత్రస్థానంలోనూ, రోహిల్ఖండ్‌లోనూ, కాన్పూరులోనూ, లక్నోలోనూ, వారాణసిలోనూ, బిహారు కొన్ని ప్రాంతాలా — విప్లవజ్వాలలు లేచాయి. కుంవార్ సింగ్ నాయకత్వాన సాగిన బిహారు విప్లవాన్ని విలియమ్ టేలర్ (పట్నా డివిజను కమిషనరు) అణచాడు. వారాణసి విప్లవాన్ని అణచిన కర్నల్ నీల్ అనేవాడు, పట్టుబడిన విప్లవకారులందరినీ హత్య చేశాడు; తిరుగుబాటుదార్లనేగాక, అనుమానితులనూ, అల్లరి పిల్లకాయలనూ కూడా బ్రిటిషు అధికార్లు స్వయంగా ఉరితీశారు. అలహాబాదు దుర్గం జూను 11న విముక్తమయింది.

విప్లవజ్వాలలు బాగా లేచినది కాన్పూరు, ఢిల్లీ, లక్నోలలో. పంజాబు పాలకులూ, ప్రత్యేకించి సిక్కునాయకులూ, కాశ్మీరు పాలకుడు గులాబ్‌సింగూ, అనేకమంది జమీందార్లూ, బ్రిటిషువారి కింద ఉద్యోగాలు చేస్తున్న భారతీయులూ కంపెనీ పట్ల విశ్వాసంగా ఉన్నారు. విప్లవాన్ని అదుపులో ఉంచటానికి తోడ్పడినవారు: సింధియా పాలకుడూ, అతని మంత్రి సర్ దిన్కర్‌రావూ, హైదరాబాదు మంత్రి సర్ సాలార్‌జంగ్, భోపాలు బేగమూ, నేపాలు మంత్రి సర్ జంగ్ బహాదుర్. బ్రిటిషు సామ్రాజ్యాన్ని కాపాడారన్న కీర్తి సింధియాకూ, సర్ సాలార్ జంగ్‌కూ దక్కింది.

కాన్పూరు విప్లవకారులకు నాయకుడు నానాసాహెబ్. వీరు బ్రిటిషువారు నిర్మించుకున్న రక్షణలను ముట్టడించారు. ఈ రక్షణలలో 400 మంది ఆయుధాలు పట్టగల

వాళ్ళూ, అనేకమంది స్త్రీలూ, పిల్లలూ ఉండి, జూను 8 మొదలు 26 దాకా ఆత్మ రక్షణ చేసుకుంటూ నానా అగచాట్లూ పడ్డారు. తమను సురక్షితంగా అలహాబాదుకు వెళ్ళనిస్తామని తిరుగుబాటుదార్లు హామీ ఇచ్చిన మీదట వారు లొంగిపోయారు (జూను 27). కాని బ్రిటిషు సైనికులు కాన్పూరు నుండి పడవలలో అలహాబాదుకు బయలుదేరే తరుణంలో అతి తీవ్రమైన కాల్పులు వారిపై జరిగాయి. నలుగురు మాత్రమే ప్రాణాలతో తప్పించుకు పోయారు. రెండు వందల పదకొండు మంది స్త్రీలూ, పిల్లలూ "బీబీఘర్"లో నిర్బంధించబడ్డారు. వారి నందరినీ వధించవలసిందిగా నానా సాహెబూ, తాంతియా తోపీ ఉత్తరు విచ్చారు. అలహాబాదు, వారాణసీలలో బ్రిటిషువారి ప్రవర్తన కూడా ఇంచుమించు ఇలాగే ఉండింది. ఇది జరిగాక తెల్లవాళ్ళు మరింత అమానుషంగా ప్రవర్తించారు.

ఢిల్లీని తిరిగి స్వాధీన పరచుకునేటందుకు జూను 8 న అంబాలా నుంచి బ్రిటిషు సైనికులు వచ్చారు. మీరట్ నుంచి మరి కొంత సేనా, పంజాబు నుంచి కొందరు సిక్కు సైనికులూ కూడా రావటం జరి



గింది. ఢిల్లీ విప్లవకారులతో ఘర్షణ ఆరంభమయింది. సెప్టెంబరు 14న ఢిల్లీలోని కాశ్మీరు గేటు ధ్వంసమయింది. మరి ఆరు రోజులపాటు తీవ్రమైన పోరాటం జరిగి, చివరకు నగరమూ, రాజభవనమూ బ్రిటిషు వారికి చిక్కాయి. బ్రిటిషు సైనికులు నగరాన్ని కొల్లగొట్టి, అనేక మంది అమాయకుల ప్రాణాలు తీశారు.

నామమాత్రపు పాదుషా అయిన రెండవ బహదుర్ షా, హుమాయూన్ సమాధి వద్ద పట్టుబడి, రంగూన్‌కు పంపబడి, అక్కడే 87 వ ఏట మరణించాడు (1862). అతని కొడుకులూ, మనమలూ కాల్చి చంపబడ్డారు.

లక్నోలో తిరుగుబాటు మే 30న ప్రారంభమయింది. 1858 మార్చి 21 దాకా ఆ నగరం బ్రిటిషువారి అధీనంలోకి తిరిగి రాలేదు. బ్రిటిషువారు లక్నోను తిరిగి స్వాధీన పరచుకొనటానికి తోడ్పడిన వాడు నేపాలు మంత్రి జంగ్ బహదుర్.

మధ్య భారతంలో తిరుగుబాటుకు నాయకుడు తాంతియా తోపే అనే మహారాష్ట్ర బ్రాహ్మణుడు. ఇతను 20,000 తిరుగుబాటు సైనికులతో సహా యమునా నది దాటి నానా సాహెబ్‌తో కలిశాడు. అయితే 1857 డిసెంబరు 6 న బ్రిటిషువారి చేతిలో పరాజయం పొంది, తరిమి వేయబడి, ఝాన్సీరాణి అయిన లక్ష్మీబాయితో చేరి మధ్య భారతంలో తీవ్రమైన ప్రతిఘటన కొనసాగించాడు. బ్రిటిషు సేనలు 1858 ఏప్రిల్ 3న ఝాన్సీని ముట్టడించాయి.

ఏప్రిల్ 4 రాత్రి ఝాన్సీరాణి కొద్ది మంది అనుచరులతోసహా ఝాన్సీదుర్గాన్ని విడిచిపెట్టి కల్పి అనే చోటికి వెళ్ళింది. కల్పిని కూడా బ్రిటిషువారు మే 22 న పట్టుకున్నారు. ఝాన్సీరాణి నిరుత్సాహపడక, తాంతియా తోపీని వెంటబెట్టుకుని గ్వాలియర్ పైనపడి, సింధియాను ఆగ్రాకు తరిమేసింది. సింధియాను అతని సేనలు విడిచిపెట్టాయి. నానాసాహెబ్ పేష్వాగా ప్రకటన జరిగింది. ఝాన్సీరాణీ, తాంతియా తోపీల వైఖరికి భయపడి బ్రిటిషువారు వారిని నిగ్రహించే ప్రయత్నాలు సాగించారు. వారు గ్వాలియరును జయించారు. 1858 జూను 17 న యుద్ధంలో, పురుషవేషంలో ఉన్న ఝాన్సీరాణి చనిపోయింది. పరారీ అయిన తాంతియా తోపీ మానసింగ్ అనే వాడిద్వారా బ్రిటిషువారికి దొరికిపోయి, ఉరి తీయబడ్డాడు. నానాసాహెబ్ నేపాలు అరణ్యాలలోకి పారిపోయి అక్కడే చనిపోయాడు. 1857 భారత స్వాతంత్ర్య సమరం అలా ముగిసింది.





# శిశువు

అంగిరస శాఖకు చెందిన ఒక మునికి కొడుకు పుట్టాడు. అప్పుడు అంగిరసుడు వచ్చి, "ఈ బిడ్డడి బుద్ధికి వార్ధక్యం అంటూఉండదు. ఎల్లప్పుడూ శిశువుగానే ఉంటాడు," అని చెప్పి, శిశువు అని పేరుపెట్టాడు.

శిశువు తన తండ్రి వద్దనే అధ్యయనం చేశాడు. స్వయంగా ఋక్కులు రచించాడు. తన కన్న పెద్దవాళ్ళను కూడా, "బిడ్డా!" అని సంబోధించేవాడు. ఇది చూసి తండ్రి సహించలేక శిశువును అంగిరసుడి వద్దకు తీసుకుపోయి, "వీడు పెద్దల పట్ల అవిధేయుడై మాట్లాడుతున్నాడు," అని చెప్పాడు.

శిశువు తనను తాను సమర్థించుకుంటూ అంగిరసుడితో, "బిడ్డా, చిన్న, పెద్ద అన్న తారతమ్యానికి అర్థమేమిటి? నాకన్న గొప్పవాడికి నేను చెప్పే అవసరంలేదు. తెలియనివాడికే చెప్పాలి. చెప్పేవాడు పెద్దవాడు, వినేవాడు చిన్నవాడు," అన్నాడు.

అంగిరసుడు ఆ మాట విని, "అది నిజమే! ఇతడు చెప్పిన ఈ మాటే ఒక ఋక్కు. ఇతడు వేదవక్తగా జన్మించాడు. ఇతడి దృష్టికి అందరూ పసివాళ్ళే," అన్నాడు. అది మొదలు శిశువును అందరూ గౌరవించారు. శిశువు వ్యర్థ సంభాషణ చేసేవాడుకాడు. అతను నోరు తెరిచి అన్న మాటలన్నీ ఋక్కులూ, సామలూ, మంత్రాలూ అయాయి.

వరుణమహర్షి కొడుకు భృగువు అనే వాడు శిశువు కన్న పెద్దవాడు. శిశువే అందరినీ పసివాళ్ళలాగా సంబోధిస్తుంటే తాను మాత్రం అలా ఎందుకు చేయగూడదనుకున్నాడు. అతను తన కన్న పెద్దవాళ్ళను, "బిడ్డా! పసివాడా!" అని సంబోధిస్తుంటే చూసి నలుగురూ కోప్పడ్డారు.

"బిడ్డలారా, నా కన్న మీరు తెలిసిన వారై ఉంటే నాతో వాదన చెయ్యండి," అన్నాడు భృగువు.

"వాదం చెయ్యదలుచుకుంటే అంగి రసుడితో వాదించి, శిశువు లాగే ఆయన ఆశీర్వాదం పొందు," అని పెద్దలు భృగు వుతో చెప్పారు.

భృగువు అంగిరసుడి వద్దకు వెళ్ళి, "అబ్బాయీ, అంగిరసుడా! నాతో వాదించి, నాకన్న తెలివిగల వాడవని నిరూపించుకో గలవా?" అని అడిగాడు.

"వాదనకు వచ్చే ముందు నాలుగు దిక్కులలోనూ ఏమున్నదీ చూసి వచ్చావా, నాయనా?" అని అంగిరసుడు భృగువు నడిగాడు.

"నువు చూసి వచ్చావా?" అని భృగువు ఎదురు ప్రశ్న వేశాడు.

"చూశాను. నువు కూడా వెళ్ళి చూసిరా. ఆ తరవాత వాదించుకుందాం," అన్నాడు అంగిరసుడు.

భృగువు సరేనని ముందు తూర్పు దిక్కుగా వెళ్ళాడు. అక్కడ కొందరు క్రూరులు మనుషులను నరికి, "ఇది నాది! ఇది నాది!" అంటూ పంచుకుంటున్నారు.

"మీ రెందు కిలా చేస్తున్నారు?" అని భృగువు ఆ క్రూరులను అడిగాడు.



"కిందటి జన్మలో వీళ్ళు మమ్మల్ని ఇలాగే నరికి పంచుకున్నారు. ఇప్పుడు మేం వీళ్ళని అదే చేస్తున్నాం," అన్నారు క్రూరులు.

"ఇలా జరగకుండా చేసే మార్గ మేమిటి?" అని భృగువు వాళ్ళను మళ్ళీ అడిగాడు.

"వెళ్ళి అంగిరసుణ్ణి అడుగు," అన్నారు క్రూరులు.

భృగువు అక్కడి నుంచి దక్షిణానికి వెళ్ళాడు. అక్కడ కూడా అలాటి దృశ్యమే కనిపించింది. పడమటికి పోతేనూ, ఉత్త రానికి పోతేనూ కూడా అదే దృశ్యం కనిపించింది. ఉత్తరదిక్కు నుండి ఈశాన్యంగా అతను తిరిగి వస్తుండగా, భృగువుకు ఇద్దరు స్త్రీలు కనిపించారు. ఒకతె దేవతా స్త్రీలా గున్నది, రెండవది వికారస్వరూపంతో ఉన్నది. ఆ ఇద్దరి మధ్యా ఒక భయం కరాకారు డున్నాడు. వాడి కళ్ళు పసుపు రంగులో ఉన్నాయి. వాడి చేతిలో దుడ్డు కఱ్ఱ ఉన్నది.

ఈ దృశ్యం కూడా భృగువుకు అర్థం కాలేదు. అతను అంగిరసుడి వద్దకు తిరిగి వచ్చి, తాను చూసి అర్థం చేసుకోలేక పోయిన విషయాలను ఆయనతో చెప్ప టానికి జంకుతూ నిలబడ్డాడు.



అతన్ని చూసి అంగిరసుడు, "నాలుగు దిక్కులా ఏమున్నదీ చూసి వచ్చిన ట్టున్నావు. అవి ఏమిటో, వాటికి విరుగు డేమిటో తెలుసుకుంటే నీకు శాంతి లభి స్తుంది," అన్నాడు.

"నేను చూసిన దేదీ నాకు అర్థం కాలేదు. వాటి అర్థం మిమ్మల్నే అడిగి తెలుసుకోమన్నారు," అన్నాడు భృగువు.

"అయితే నువు వెళ్ళి శిశువును అడుగు. అతను చెబుతాడు," అన్నాడు అంగిరసుడు.

భృగువు శిశువు వద్దకు వెళ్ళి, తాను చూసిన దృశ్యాలు చెప్పి, అర్థం అడిగాడు.

శిశువు ఇలా చెప్పాడు:

"నువు తూర్పు దిక్కున చూచిన క్రూరులు చెట్లు. యజ్ఞకర్మ తెలియని మానవులు తమ స్వార్థం కొరకు చెట్లనూ, కొమ్మలనూ, పూలనూ, కాయలనూ నరికి నందువల్ల ఆ చెట్ల చేత నరకబడుతున్నారు. ఇది జరగకుండా ఉండాలంటే అగ్నిలో చెట్ల సమిధలు వేసి యజ్ఞకర్మ చేయాలి. దక్షిణాన నీకు కనిపించిన క్రూరులు పశువులు. స్వార్థపరులై పశువులను వధించిన మనుషులను అవి ఇప్పుడు శిక్షిస్తున్నాయి. దీనికి విరుగుడు యజ్ఞంలో పశువులను బలి చెయ్యటమే. పడమట నీకు కనిపించిన క్రూరులు ఓషధులు. వాటిని కూడా యజ్ఞంలో హోమం చేస్తే దోషం ఉండదు. ఉత్తర దిక్కున నీకు కనిపించిన క్రూరులు జలాలు. వాటిని కూడా యజ్ఞ జలాలుగా వినియోగిస్తే దోషం పోతుంది. ఇంటికి తిరిగి వస్తూ నువు చూసిన స్త్రీలు శ్రద్ధా, అశ్రద్ధా. వారి మధ్య నున్నవాడు క్రోధమూర్తి. యజ్ఞ కర్మయందు శ్రద్ధ ఉంచి, అశ్రద్ధను చేర నివ్వనివాడు క్రోధాన్ని జయించి బాగుపడ గలుగుతాడు."

శిశువు వద్ద ఈ విషయాలు తెలుసుకున్న అనంతరం భృగువు తన గర్వాన్ని విడిచి పెట్టి, గొప్పవాడయాడు.






## 13

[పూజారి ప్రోత్సాహంతో చెంచునాయకుడూ, అతడి అనుచరులూ, శిఖిముఖీ వాళ్ళమీద హఠాత్తుగా దాడిచేశారు. విక్రమకేసరి, చెంచునాయకుణ్ణి గుర్రం మీది నుంచి పడగొట్టి, గుర్రాన్ని శిఖిముఖీ, నాగుమల్లులకు ఒప్పచెప్పాడు. చెంచులు గుర్రం మీదినుంచి జారి పడిన నాగుమల్లిని అరణ్యంలోని ఒక పులిబోను దగ్గిరకు తీసుకుపోసాగారు. తరవాత—]

చెంచులు నాగుమల్లిని పులిబోను దగ్గిరకు తీసుకుపోయి, దాని పక్కగా నేల మీద పడుకోబెట్టారు. నాగుమల్లికి యింకా స్పృహ రాలేదు. చెట్టు మీది నుంచి యిధంతా చూస్తున్న శిఖిముఖికి ఒక్క క్షణంపాటు, మల్లిని పులిబోనులో ఎరగా పెడతారేమో అన్న భయం కలిగింది. కాని, అంతలోనే అతడికి చెంచునాయకుడైన బడే చెంచు అన్న మాటలు గుర్తుకు వచ్చినై. వాడు అమెను బందీగా చేసి, అమె తండ్రి అయిన సవరగండుపోతు నుంచి ధనం గుంజాలని చూస్తున్నాడు. కాని, వాడి అనుచరులు మల్లిని పులిబోను దగ్గిర ఎందుకు దించారు?

శిఖిముఖి యిలా ఆలోచిస్తున్నంతలో, చెంచువాళ్ళల్లో ఒకడు చుట్టూ కలయచూసి, పెద్దగా గొంతెత్తి, "బూతాలదొరా!" అని కేక పెట్టాడు.



ఉత్తరక్షణంలో పులిబోనుకు వెనకవున్న గుబురు చెట్లల్లోంచి, "ఎవ్వడ్రా వాడు? చారల మెకాన్ని బెదరకొడుతున్నావా? నిలువునా పాతేస్తాను! పో అక్కణ్ణించి," అన్న జవాబు వచ్చింది.

చెంచులు ఆ జవాబుకు బెదిరిపోయి అటు చూసేంతలో చెట్ల కొమ్మల్లోంచి ఊడల సాయంతో, నల్లగా, పొట్టిగా, బక్క చిక్క వున్న వాడొకడు నేల మీదికి దిగాడు. వాడి మెడలో ఎముకల దండ ఒకటి వున్నది, చేతిలో వంకర టింకరగా వున్న పొడవాటి కర్ర ఒకటి పట్టుకుని వున్నాడు. వాడు చెంచు దయ్యాలపోతు.



దయ్యాలపోతు పులిబోనును సమీపిస్తూనే, నేల మీద పడి వున్న నాగుమల్లికేసి ఆశ్చర్యంగా చూస్తూ, "ఎవర్రా యిదీ, దేవతా పిల్లలా వుంది? ఎందు కిక్కడికి తీసుకొచ్చారు? ఎవరు చంపారు?" అని ప్రశ్నించాడు.

చెంచుల్లో ఒకడు జరిగిందంతా అతడికి చెప్పి, "బడేదొర యీ పిల్లని ఆకాశగుహ దగ్గరకు తీసుకురమ్మన్నాడు. కాని, చాలా సేపుగా కదలా మెదలక పడున్నది. చచ్చిపోయిందేమో అని భయంగా వున్నది. దొర మా ప్రాణాలు తీసేస్తాడు," అన్నాడు వణికిపోతూ.

భూతాలరాయుడు, నాగుమల్లి ముక్కు పుటాల దగ్గిర వేలుపెట్టి చూసి, "చావ లేదు, ప్రాణం వున్నది. గుర్రం మీంచి పడ్డ పాటుకు ప్రాణం కడబట్టింది. మందూ మంత్రం వేసి యిప్పుడు మెళుకువ తెప్పించామా — మీ కందకుండా పారిపోతుంది. ఇదుగో, యీ భస్మం తీసుకోండి. ఆకాశ గుహ చేరిం తరవాత ముక్కు దగ్గిర పెట్టండి. నాలుగు తుమ్ములేచి కూచుంటుంది," అని నడుం నుంచి వేలాడుతున్న సంచీలోంచి, ఒక పొట్లం తీసి చెంచువాడికి యిచ్చాడు.





చెంచువాడు ఆ పొట్లం తీసుకుని రొండిన దోపుకుని, రెండోవాణ్ణి హెచ్చరించాడు. ఇద్దరూ కలిసి నాగుమల్లిని తిరిగి భుజాన వేసుకుని బయలు దేరారు. ఇదంతా చూస్తున్న శిఖిముఖికి నాగుమల్లిని వాళ్ళ బారి నుంచి రక్షించటం చాలా తేలిక అన్న ధైర్యం కలిగింది. అతడు నాగుమల్లిని ఎత్తుకు పోతున్న చెంచులను మధ్య మార్గంలో అటకాయించా లనుకున్నాడు.

శిఖిముఖి తన వెంట వున్న శబరుడితో తాను తిరిగి వచ్చేవరకూ, చెంచు భూతాల రాయుణ్ణి ఓ కంట కనిపెట్టి వుండమని చెప్పి, చెట్ల కొమ్మల మీదుగా ముందుకు కొంత దూరం పోయేసరికి, గండశిలల దగ్గిర తమను ఎదుర్కొన్న చెంచులు కొందరు, నాగుమల్లిని ఎత్తుకుపోతున్న వాళ్ళను సమీపిస్తూండటం అతడి కంటబడింది. ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి నిరుత్సాహ పడిపోయాడు. ఇందర్ని ఎదిరించి నాగు మల్లిని రక్షించటం సాధ్యమయేది కాదని అతడు నిర్ణయించుకున్నాడు. విక్రమకేసరి వెంట తీసుకువచ్చే శబరుల సహాయంతో, తాను చెంచునాయకుడి ఆకాశగుహను ముట్టడించటం ఒక్కటే, నాగుమల్లిని రక్షించటానికి మిగిలిన మార్గం...



విక్రమకేసరి వచ్చేవరకూ తాను చేతులు ముడుచుకు కూర్చోవలసిందే అను కున్నాడు, శిఖిముఖి. అంతలో అతడికి భూతాలరాయుడూ, పులిబోనూ గుర్తుకు వచ్చినై. ఆటవికుల్లో ఒకడుగా అతడికి, అలాంటి జాతివాళ్ళ మీద మంత్రతంత్రాలు ఎరిగిన వ్యక్తులు చలాయించే అధికారం గురించి బాగా తెలుసు. చెంచు భూతాల రాయుణ్ణి కాస్త హడలకొట్టి, వీలయితే అతడి ద్వారా కొంత సహాయం సంపాయించా లనుకున్నాడు, శిఖిముఖి. ఆ వెంటనే అతడు నిశ్శబ్దంగా చెట్ల కొమ్మల్లో కదిలి, పులి బోను వున్నచోటుకు వచ్చాడు.



భూతాలరాయుడు ఒక చిన్న మేకను, మెడతాడు పట్టుకుని బోనుదగ్గరకు లాక్కురా ప్రయత్నిస్తున్నాడు. కాని అది అరుస్తూ అటూయిటూ గెంతుతున్నది. శిఖిముఖి కొద్దిసేపు యిదంతా చూసి, పులిలా పెద్దగా ఒక్కసారి గాండ్రుపెట్టి, చెట్ల కొమ్మల్లోంచి వేగంగా భూతాలరాయుడి ముందు దూకాడు.

భూతాలరాయుడు అదురుకుని కేక పెట్టి పారిపోబోయినవాడల్లా, తన ముందు దూకినది పులి కాదనీ, శబరయువకుడనీ చూసి, వంకరకర్ర పైకెత్తుతూ, "ఎవడ్రా నువ్వా? చెంచు దయ్యాలపోతుతోనే పరాచ



కాలా? నిన్ను మారేడుకాయలో దట్టించి ముక్కుపొడుం కింద పీల్చేస్తాను," అన్నాడు రౌద్రంగా.

శిఖిముఖి ఏమీ మాట్లాడకుండా, ఎడమ చేత్తో అతడి చేతిలోంచి కర్ర లాక్కుని, కుడిచేత్తో అతడి జుట్టు వడిసి పట్టుకున్నాడు. భూతాలరాయుడు పట్టు విడిపించుకునేందుకు పెనుగులాడుతూ, "ఎవడ్రా నువ్వూ, వెర్రికుంకా! బతుకు మీద రోశావా, ఏం? నే నెవర్ననుకున్నావ్? బడేచెంచు ముఠావాణ్ణి, ఆ చెంచు తరవాత అంతవాణ్ణి, వదులు!" అన్నాడు.

శిఖిముఖి పెద్దగా నవ్వి, "నువ్వెవడివైతే నాకేం, దయ్యాలపోతూ? ఒక మాటచెప్పు; ఈ పక్కనే నీటిమడుగు చూశాను. పులి ఏ వేళప్పుడు దప్పిక తీర్చుకునేందు కక్కడికి వస్తుంది?" అని ప్రశ్నించాడు.

భూతాలరాయుడు ఆ ప్రశ్న వింటూనే కళ్ళెర్రచేసి, "ఎవడ్రానువు, నన్ను ప్రశ్నలడగటానికి? జుట్టు వదులు ముందు!" అంటూ హుంకరించాడు.

"అయితే నిన్ను ఏం ప్రశ్నలడగను, అంతా ఆ పెద్దపులే చూసుకుంటుంది!" అంటూ శిఖిముఖి, దయ్యాలపోతును నడుం పట్టుకుని పైకెత్తి పులిబోను దగ్గరకు తీసుకు



పోయి, "మేక బదులు నిన్ను పులికి ఎరగా పెడుతున్నాను, తెలిసిందా?" అంటూ బోనులోకి తోయబోయాడు.

భూతాలరాయుడు గడగడ వణికిపోతూ, "నువ్వేవరో తెలియక దూషించాను, క్షమించు! నన్ను పులికి ఆహారంగా వెయ్యకు. బతికున్నన్నాళ్ళూ నీకు సేవ చేస్తాను," అంటూ బావురుమన్నాడు.

శిఖిముఖి, అతణ్ణి వదిలి, "అలా అయితే నిన్ను పెద్దపులికి మేతగా వెయ్యను. బతికున్నన్నాళ్ళూ నాకు సేవచేయ నవసరం లేదు, ఒక్క ఇరవైనాలుగ్గంటలు నేచెప్పినట్టు చెయ్యి, చాలు," అన్నాడు.

"చిత్తం. ఆజ్ఞాపించు. నీ దాసుణ్ణి," అంటూ భూతాలరాయుడు, శిఖిముఖికి సాష్టాంగ ప్రాణాచారం పడిపోయాడు.

శిఖిముఖి అతణ్ణి లేవమని చెప్పి, "సవరగండుపోతు కూతుర్ని మీవాళ్ళు బలవంతంగా ఎత్తుకుపోయారు; నువ్వు చూశావుగదా? ఆమెను యీ రాత్రే నేను కాపాడదలిచాను. ఎలా అని అడక్కు. కాని, నువ్వొకటి చేయాలి. మీ ఆకాశగుహ ముందుండే గుడిశెల చుట్టూ వున్న కంచె ద్వారాన్ని యీ రాత్రికి తాళ్ళతో లోపలి నుంచి బంధించకుండా అట్టే పెట్టాలి. గండుపోతు కూతుర్ని ఆ ద్వారానికి సాధ్య





మైనంత దగ్గిరగావున్న గుడిసెలో వుంచాలి. ఈ పనులు చేయగలవా?" అన్నాడు.

"చిత్తం. నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. చెంచు ముఠాలో నా మాటకు తిరుగు లేదు," అన్నాడు భూతాలరాయుడు.

"అది నిజమేకావచ్చు. కాని, నువ్వు అన్నమాట నిలుపుకోపోతే? నన్ను మోసం చేస్తే?" అని ప్రశ్నించాడు, శిఖిముఖి.

"ఆకాశదేవర మీద ఒట్టేస్తున్నాను, సరా?" అంటూ భూతాలరాయుడు మెళ్ళో వున్న ఎముకల దండను కళ్ళకద్దుకున్నాడు.

"అలా అయితే ఆ దండను నా దగ్గిర యిచ్చిపో. నువ్వు చెప్పినట్టు చేస్తే, ఆ తర



వాత దాన్ని నీకు తిరిగి యిచ్చేస్తాను," అన్నాడు శిఖిముఖి, ఎముకల దండను చేత్తో గట్టిగా పట్టుకుని.

భూతాలరాయుడు లబలబ లాడిపోతూ, "ఈ మహత్తు గల దండలోనే వుంది, నా మంత్రశక్తంతా! ఇది మెళ్ళో లేకపోతే నేను చిల్లిగవ్వకు మారను. చెంచులంతా నన్ను కొండగబ్బిలాని కన్న హీనంగా చూస్తారు," అన్నాడు.

"సరే, ఆడిన మాట తప్పవుగదా? జాగ్రత్త. మోసం చేయాలని ప్రయత్నించావో, నిన్నేదో ఒకనాడు పట్టుకుని పెద్ద పులికి ఆహారంగా వేస్తాను," అన్నాడు శిఖిముఖి.

"మూడు కోట్ల కొండదయ్యాలూ, ఆరు కోట్ల అరణ్యభూతాలూ సాక్షిగా చెపుతున్నాను; నేను అన్నమాట నిలబెట్టుకుంటాను," అన్నాడు భూతాలరాయుడు.

"అలా అయితే, నువ్వు మీ ఆకాశ గుహకు వెళ్ళిపో. నాగుమల్లికి ఎలాంటి హానీ జరక్కుండా చూడు. ఈ బోను సంగతి నే చూస్తాలే," అన్నాడు శిఖిముఖి.

"చిత్తం, అలాగే పోతాను. అసలు నేను ఎక్కువగా వుండేది యీ అరణ్యంలోనే. ఆ కనబడే మాను వెనకే నా గుడిసె వున్నది.



సెలవు," అంటూ భూతాలరాయుడు అక్కణ్ణించి బయలుదేరాడు.

శిఖిముఖి చెట్టెక్కి భూతాలరాయుడు ఎటు పోతున్నదీ పరీక్షగా చూసి, వాడు ఆకాశగుహ కేసే పోతున్నట్టు తెలుసుకుని, చెట్టుదిగి వచ్చాడు. తరవాత అతడు మేకను బోనులో కట్టివేసి, అంతవరకూ రహస్యంగా చెట్టు మీదవున్న శబరుణ్ణి కేకవేశాడు. వాడు చెట్టుదిగి రాగానే, శిఖిముఖి వాణ్ణి వెంట బెట్టుకుని, భూతాలరాయుడు చెప్పిన గుడిశెలో ఏమున్నదో చూసేందుకు వెళ్ళాడు.




గుడిశెలో శిఖిముఖికి కొన్ని పులితోళ్ళూ, ఎలుగుచర్మాలూ గోడకు వేళ్ళాడుతూ కనిపించినై. నడిమింటి గుంజకు వున్న కొయ్యమేకులకు కొన్ని కపాలాలు తగిలించబడి వున్నయ్. శిఖిముఖి వాటిని పరీక్షించి చూసి, ఒక పులితోలునూ, ఒక కపాలాన్నీ తీసుకున్నాడు. రాత్రికి చెంచుముఠా వుండే ప్రాంతానికి వెళ్ళినప్పుడు, వాటితో కొంత అవసరం కలగవచ్చునన్న ఆలోచన అతడికి కలిగింది.

సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా విక్రమకేసరి యాభై అరవైమంది అనుచరులతో శిఖిముఖి వున్నచోటుకు వచ్చాడు. వాళ్ళల్లో సవరలూ, శబరులూ కూడా వున్నారు. శిఖిముఖి, విక్రమకేసరికి అతడు లేనిసమయంలో జరిగినదంతా చెప్పి, "ఆ దయ్యాలపోతు అన్నమాట నిలబెట్టుకుంటాడన్న పూర్తి నమ్మకం నాకున్నది. అందువల్ల మనం అయిదారుగురం రాత్రికి వాళ్ళ గుడిశెల్లో జొరబడి నాగుమల్లిని విడిపించుకు రావచ్చు. అలాకాక మనం గుంపుగా వెళ్ళి వాళ్ళ మీద దాడి చేస్తే, అనవసర రక్తపాతమే కాక, కోపంకొద్దీ చెంచులు నాగుమల్లి కేదైనా హాని కలిగించవచ్చు," అన్నాడు.

"ఈ ఆలోచన బావుంది. ఒకటి మాత్రం మరిచిపోకు. మన ప్రధాన శత్రువు శిఖి

లాలయ పూజారి! వాడే యీ దుర్మార్గాల కన్నిటికీ కారకుడు. వాడి సంగతే నీవు మరిచినట్టున్నది," అన్నాడు విక్రమకేసరి.

"వాణ్ణి పట్టుకునే ప్రయత్నంలోనే గదా, మనం యీ చిక్కులో పడింది. వాణ్ణెలా మరుస్తాను? వాడీ రాత్రి కంటబడ్డాడో నూకలు చెల్లినవాడికిందే లెక్క!" అన్నాడు శిఖిముఖి పళ్ళుకొరుకుతూ.

ఆ తరవాత వాళ్ళిద్దరూ కొంతసేపు సంప్రతింపులు జరిపి, మొత్తం అనుచరుల్ని వెంటబెట్టుకుని ఆకాశగుహ ప్రాంతానికి వెళ్ళేట్టూ, అక్కడికి చేరిం తరవాత ఒక పదిమందితో మాత్రం ముందుగా చెంచుల గుడిశెల దగ్గిరకు పోయి, పరిస్థితుల్ని బట్టి అవసరం అయితే తతిమ్మా వాళ్ళ సహాయం కూడా తీసుకునేట్టూ నిర్ణయించుకున్నారు.

సూర్యాస్తమయం అవగానే అందరూ అరణ్యమార్గాన చెంచుల నాయకుడుండే కొండప్రాంతానికి బయలుదేరారు. ఒక పావుగంట కాలం గడిచేసరికి వాళ్ళకు వెనక వైపునుంచి పులి పెద్దగా గాండ్రించిన ధ్వని వినబడింది. ఆ ధ్వని వింటూనే అందరికన్న ముందు నడుస్తున్న శిఖిముఖి ఆగి, "దయ్యాలపోతు పెట్టిన బోనులో పెద్దపులి పడినట్టుంది. మీలో అయిదారు గురు పోయి బోనుతో సహా దాన్ని లాక్కరండి. అవకాశం దొరికితే చెంచుల్ని కొండ మీది నుంచి కింది లోయల్లోకి గెంతిద్దాం," అని చెప్పాడు.

శిఖిముఖి యిలా చెప్పగానే, పదీపన్నెండు మంది శబరులు వెనుదిరిగి బోను దగ్గిరకు పరిగెత్తారు. అతడు వూహించినట్టు పెద్దపులి బోనులో చిక్కుకుని, బయటపడే మార్గం లేక పెద్దగా అరుస్తూ నానా హంగామా చేస్తున్నది. చిన్న కొయ్యచక్రాల మీద కట్టిన ఆ బోనును శబరులు తాళ్ళ సాయంతో, శిఖిముఖి వున్న చోటుకు యీడ్చుకు పోసాగారు. —(ఇంకా వుంది)





# యుగధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ కలికాలంలో మంచికి చోటులేదు. ఆ సంగతి నీకు గుర్తు చెయ్యటానికి రామశాస్త్రి అనే వాడి కథ చెబుతాను. శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ద్వాపరయుగం ముగిసి. కలి అడుగు పెట్టిన దినాలలో ఒక కుగ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబం ఉండేది. బ్రాహ్మణ దంపతులకు రామశాస్త్రి అని ఒక్కడే కొడుకు. రామశాస్త్రి తండ్రి పౌరోహిత్యం చేసి పొట్టపోసుకున్నాడు. తండ్రికి వార్ధక్యం వచ్చాక, ఆ పని రామశాస్త్రి పైన పడింది.

ఒకనాడు రామశాస్త్రి ఒక ఇంట పెళ్ళి చేయించటానికి దూర గ్రామం వెళ్ళాడు.

## బేతాళ కథలు



పెళ్ళి పూర్తి అయింది. రామశాస్త్రి సుష్టుగా భోజనం చేసి, పెళ్ళివారు ఇచ్చిన సంభావనా, కానుకలూ, దానాలూ తీసుకుని స్వగ్రామానికి బయలుదేరాడు. వైశాఖ మాసపు ఎండ మహా తీవ్రంగా ఉన్నది. విందు భోజనంలో నెయ్యి జాస్తిగా తాగిన కారణంచేత రామశాస్త్రికి నోరు ఆర్చుకుపోసాగింది. ఎంత దూరం వెళ్ళినా ఒక బావిగాని, చెరువుగాని శాస్త్రికి కనిపించలేదు.

అయితే దారిలో ఒక చెరుకుతోట కనిపించింది. తోటకు సంబంధించిన వారెవరైనా కనిపిస్తే, వారి నడిగి ఒక చెరుకుదంటు పుచ్చుకుని, దానితో తన దప్పిక తీర్చుకుందా మనుకున్నాడు రామశాస్త్రి, కాని అక్కడ ఎవరూ కనిపించలేదు.

ముందు ప్రాణాన్ని నిలుపుకోవటం అన్ని ధర్మాలలోకీ గొప్పది గనక రామశాస్త్రి ఒక చెరుకుగడ విరిచి, దాన్ని తిని, దాని రసంతో దప్పిక తీర్చుకుని, పోయే ప్రాణాన్ని నిలబెట్టుకున్నాడు. తీరా ప్రాణం నిలిచాక అతనికి అనుమానం వచ్చింది. తాను చేసినది దొంగతనం కాదా? చెరుకు తోట ఎవరిదో తెలీదు. ఒక చెరుకుగడ విరిచి, తిని, తాను తోటగలవారికి కొంత నష్టం కలిగించాడు. కనీసం చెరుకుగడ విలువ తాను అచ్చుకోవటం తన విధి. ఇలా అనుకుని రామశాస్త్రి, ఒక రాగిమాడ చెరుకుమోడు మీద ఉంచి, తిరిగి తన దారిపట్టాడు.

ఇదంతా అదృశ్యంగా ఉండి గమనించిన కలిపురుషుడు ఒక అస్పృశ్యుడి రూపం ధరించి, రామశాస్త్రి వెనకనే నడిచి రాసాగాడు. ఇది గమనించని రామశాస్త్రి, ఇంటికి చేరుకుని, కాళ్ళు కడుక్కునేటందుకు నీళ్ళు తెమ్మని తల్లిని కేకవేశాడు.

తల్లి చెంబుతో నీళ్ళు తెచ్చి, తన కొడుకు వెనకనే నిలబడి ఉన్న కలిపురుషుణ్ణి చూసి, "వాడెవడ్రా?" అని రామశాస్త్రిని అడిగింది. రామశాస్త్రి వెనక్కు తిరిగి కలి

పురుషుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. వాడు తన వెనక ఎందుకు వచ్చాడో అతనికి అర్థం కాలేదు.

రామశాస్త్రి తల్లి అడిగిన ప్రశ్నకు కలి పురుషుడే జవాబు చెబుతూ, "నేను కల్లు దీసే కాలిగాణ్ణి, అమ్మగారూ. ఈ అయ్యగారు దారిలో నా దగ్గిర కల్లు తీసుకుని తాగి, డబ్బుల కోసం ఇంటికి రమ్మన్నారు. అందుకని వెంట వచ్చాను," అన్నాడు.

"అయ్యో, దైవమా!" అని రామశాస్త్రి తల్లి మూర్ఛపోయింది.

ఇంతలో రామశాస్త్రి తండ్రి బయటికి వచ్చి, "ఏమిటది? ఏమైంది?" అన్నాడు. ఆయన తన భార్యను లేవనెత్తుతూ, "ఏం జరిగిందిరా?" అని కొడుకును అడిగాడు.

రామశాస్త్రి నోరు మెదిపేలోపల కలి పురుషుడు, "అయన్నేమడుగుతారు? నన్నడగండి, చెబుతా!" అంటూ ముందు చెప్పిన మాటే చెప్పాడు.

రామశాస్త్రి తండ్రి మండిపడి, "నా కొడుకేమిటి? కల్లు తాగడమేమిటి? నువే తాగి వచ్చి, పేలుతున్నావు," అన్నాడు.

కలిపురుషుడు తొణకక, "అబద్ధ మాడటానికి నాకేం పని? నా మాట నమ్మకం లేకపోతే నీ కొడుకు చేత ఇంత ఉప్పు తినిపించు. తాగిన కల్లంతా కక్కేస్తాడు. నిజం దానంతట అదే బయటపడుతుంది," అన్నాడు. తండ్రి లోపలికి వెళ్ళి, ఇంత ఉప్పు తెచ్చి రామశాస్త్రి చేత తినిపించాడు. ఉప్పు మూలాన రామశాస్త్రికి వాంతి అయింది. ఈలోపల రామశాస్త్రి తాగిన చెరుకు పానకం పొట్టలో పులిసి కల్లువాసన కొట్టింది.




తమ కొడుకు నిజంగానే కల్లు తాగాడన్న నమ్మకం రామశాస్త్రి తల్లిదండ్రులకు ఏర్పడిపోయింది. రామశాస్త్రితో తండ్రి, "నీవంటి గుణవంతుడు లేడని నేను చాలా గర్వపడుతూ వచ్చాను. మన కులానికీ, వంశానికీ అప్రతిష్ఠ కలిగించేపని చేశావు. ఇక నుంచీ

మాకు కొడుకూలేడు, నీకు తల్లిదండ్రులూ లేరు. నువు ఆ అస్పృశ్యుడితోనే వెళ్ళిపో!" అంటూ, భార్యతో సహా ఇంట్లోకి వెళ్ళి పోయి, తలుపు మూసేశాడు.

రామశాస్త్రికి దుఃఖం ముంచుకొచ్చింది. ఏ పాపమూ చెయ్యని తన పైన ఈ నింద ఎలా వచ్చింది? తాను ఎన్నడూ ముఖమైనా చూడని అస్పృశ్యుడు తనపై ఈ అభాండం ఎందుకు వేశాడు? అతని కేమీ అంతు బట్టలేదు. అతను, వెళ్ళిపోతున్న కలిపురుషుడి వెంటబడి, "అయ్యా, నువ్వెవరు? నేను కల్లు తాగానని నా తల్లిదండ్రులతో ఎందుకు అబద్ధం చెప్పావు? నేను నీ కేం ద్రోహం చేశాను? ఎలాటి పాపమూ చెయ్యని నాకు కులభ్రష్టత్వపు శిక్ష ఎందుకు విధించావు?" అని అడిగాడు.

కలిపురుషుడు రామశాస్త్రి కేసి తేరిపార జూసి, "నువు మహా పాపం చేశావు. అందుకే నీకి శిక్ష విధించాను. నీ మనసు పరీక్షించి చూసుకో, నువు చేసిన పాపం తెలుస్తుంది," అని అంతర్ధానమయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, రామశాస్త్రి చేసిన పాపం ఏమిటి? తెలిసి చెప్పకపోయావో నీ తలపగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కాపలా లేని తోటలో తన ప్రాణం నిలుపుకునేటందుకు ఒక చెరుకుగడ తీసుకోవటం తప్పను కోవటమే రామశాస్త్రి చేసిన పాపం. అతనిలో కలిధర్మం అప్పటికే తల ఎత్తింది. అందు చేతనే తాను తిన్న చెరుకుగడకు ధరకట్టి, రాగిమాడను ఇచ్చాడు. ఇలాటి ధర్మమూ, ఆస్తి హక్కులూ ద్వాపరంలో లేవు. రామశాస్త్రిలో ముందే కలి ప్రవేశించి ఉండటం చేత కలిపురుషుడు అతన్ని శిక్షించగలిగాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)







# కష్టార్జితం

ఒక గ్రామంలో కామయ్య అనే కమ్మరి ఉండేవాడు. అతను మంచి పనిమంతుడే గాక, బలమూ, ఓపికా, పట్టుదలా కలవాడు. అతను గొడ్డళ్ళూ, కొడవళ్ళూ, పారలూ, పలుగులూ, సమస్తమూ తన స్వశక్తితో చేసేవాడు. కొలిమికి తిత్తి వెయ్యటానికి మాత్రం ఒక కూలివాణ్ణి పెట్టుకునేవాడు. కష్టపడి పని చెయ్యటం కామయ్యకు చాలా ఇష్టం.

సోమయ్య అని కామయ్యకొక కొడుకుండేవాడు. వాడు పేరుకు తగ్గట్టే తగని సోమరి. వాడు సోమరిగా తయారు కావటానికి వాడి తల్లే కారణం. మొగుడు ఉదయం నుంచి రాత్రి ఝాము పొద్దు పోయినదాకా చెమటోడ్చి భారీ పనులు చేస్తూ ఉండటం ఆమెకు ఏమాత్రమూ నచ్చేదికాదు. తన కొడుకు కమ్మరిపని నేర్చుకోవటం ఆమెకు ఇష్టంలేదు కూడా.

"నీలో నూరోవంతు శ్రమపడకుండా బోలెడంతమంది నీ కన్న ఎక్కువే సంపాదిస్తున్నారు. నీ సంపాదనంతా కలిసి యాయవార బ్రాహ్మడు సంపాదించేటంత లేదు! రోజల్లా ఒళ్ళు హూనం చేసుకుంటావు!" అని భార్య శేషమ్మ కామయ్యని రోజూ ఎత్తి పొడిచేది.

ఆమె ఆ మాట అన్నప్పుడల్లా కామయ్య, "కష్టార్జితం విలువ నీకేం తెలుస్తుందే? తేలిగ్గా సంపాదించిన డబ్బు మట్టితో సమానం!" అనేవాడు.

కాని శేషమ్మ దృష్టిలో డబ్బు డబ్బే. ఆమె అన్న చదువుకుని ఉద్యోగం చేసి నిక్షేపంగా బతుకుతున్నాడు. తన కొడుకు కూడా చదివి, ఉద్యోగం చెయ్యాలని, శేషమ్మ తీర్మానించుకున్నది.

సోమన్నను బడికి పంపారు. కాని వాడికి చదువు అంటలేదు. వాడు బడి ఎగ్గొట్టి ఊరు

వి. నారాయణరావు



వెంట తిరిగేవాడు. వాడికి చదువు రాదని రూఢి అయాక, తండ్రి వాణ్ణి మెల్లిగా కమ్మరం పనికి అలవాటు చేద్దామని, "ఊరికే తిరగకపోతే కొలిమికి తిత్తి అయినా పొయ్యరాదు ట్రా?" అని అడిగాడు. సోమన్నకు చదువంటే ఎంత అసహ్యమో, తండ్రి చేసే పని అంటే అంతకన్నకూడా అసహ్యం. అందుచేత వాడు తండ్రి కంట పడకుండా అక్కడాయిక్కడా తప్పుకు తిరుగుతూ వచ్చాడు.

సోమన్న పెరుగుతున్న కొద్దీ కామయ్యకు ఆందోళన ఎక్కువయింది. తన శరీరంలో జవసత్వాలు తగ్గుతాయిగాని పెరగవు. కొడుకు కులవృత్తి నేర్చుకున్నవాడూ కాలేదు, చదువుకున్నవాడూ కాలేదు.

అందుచేత కామయ్య తన భార్యతో, "నా ఒంట్లో ఇంకా శక్తి ఉండగానే నీ కొడుకును నేను చేసే పని నేర్చుకోమని చెప్పు. నా అనంతరం వాడీపని కొనసాగించక పోతే, నా శరీరంలో ఊపిరి ఉండగానే ఈ దుకాణం ముయ్యవలిసి వస్తుంది. మన వాడేమో ఎందునా కాకుండా పోతాడు. నేను సంపాదించినది ఖర్చు చేస్తూ బతకాలని వాడి ఉద్దేశం లాగుంది. దాన్ని వాడు మూడు పూటల్లో ఖర్చు చేసేస్తాడు. ఆ తరవాత చిప్ప పట్టుకుని అడుక్కు తినాలి సిందే!" అంటూ హెచ్చరిక చేశాడు.

శేషమ్మ కొడుకు మీది తీపి కొద్దీ, "నీ దంతా సోద్దెం! సమ్మెట చేత బట్టు కుంటేగాని వాడు బతకలేకపోతాడా ఏం? ఏదన్నా పని సంపాదించి నాలుగు డబ్బులు కళ్ళజూసే ప్రయత్నంలోనే వాడూ ఉన్నాడు. నువు సంపాదించిన మాన్యాల మీద బతుకుదామని వాడేమీ అనుకోవటం లేదులే!" అని సోమన్నను వెనకేసు కొచ్చింది.

కామయ్యకు మండుకొచ్చింది; "అవును! సంపాదిస్తాడు! నేను ఏనాడూ మూడు

రూపాయలకు తక్కువ సంపాదించకుండా ధుకాణం కట్టెయ్యలేదు. మూడు రూపాయలుకాదు—మూడు పావలాలు సంపాదించి తెచ్చి నాకు చూపించమను నీ కొడుకును!" అన్నాడు.

అప్పుడే ఇంటికి వచ్చిన సోమన్న ఈ మాట విన్నాడు.

"మీ అయ్య ఏమంటున్నాడో విన్నావు(టా? నువు మూడు పావలాలు కూడా సంపాదించలేవుట!" అన్నది తల్లి వాడితో.

"ముష్టి మూడు పావలాలు క్షణంలో సంపాదిస్తాను," అన్నాడు సోమన్న దర్పంగా. తండ్రి మాట అబద్ధం చెయ్యాలన్న తాప(త్రయం వాడిలో ఉన్నది. కాని ఎ(రవిగానీ ఎలా సంపాదించాలో వాడికి తెలీదు.

మర్నాడు మిట్టమధ్యాన్నందాకా సోమన్న ఊళ్ళంతా తిరిగాడు, మూడు పావలాల కోసం గాలిస్తూ. వాడు ఎండనపడి ఇంటికి రాగానే, "ఏమన్నా సంపాదించావు(టా, నాయనా?" అని తల్లి అడిగింది.

"ఏదీ? ఇంకా సరిగా (ప్రయత్నించలా. అన్నంపెట్టు, ఆ తరవాత మళ్ళీ పోతా," అన్నాడు సోమన్న. వాడు అన్నం తిని పొద్దు వాలినదాకా ని(ద్రపోయి లేచాడు.

"ఏంరా, నాయనా? అన్నం తిని వెళ్ళి డబ్బు సంపాదించుకొస్తానంటివే? మీ నాన్న








ముందు నా పరువు కూడా తీస్తావురా?" అని తల్లి అడిగింది.

"ఇవాళకు నువ్వు మూడు పావలా లియ్యమ్మా! రేపు నేనే సంపాదిస్తాను," అన్నాడు సోమన్న.

తన పరువూ, కొడుకు పరువూ కూడా నిలుస్తుందిగదా అని శేషమ్మ తన దగ్గిర ఉన్న డబ్బులోంచి మూడు పావలాలు తీసి సోమన్న కిచ్చింది.

రాత్రి కామయ్య ఇంటికి వస్తూనే మంచం మీద పడుకుని కూనిరాగాలు తీస్తున్న కొడుకును చూసి, "ఏం సంపాదించావురా ఇవాళా?" అని అడిగాడు.

"ఇదుగో, చూడు! మూడు పావలాలు!" అంటూ సోమన్న తన తల్లి ఇచ్చిన మూడు పావలాలూ తండ్రి చేతిలో పెట్టాడు.

కామయ్య వాటి కేసి క్షణంసేపు చూసి, "ఛీ, ఇవి నీ కష్టార్జితం కాదు!" అంటూ వాటిని పొయ్యిలోకి విసిరాడు. సోమన్న తల వంచుకుని అవతలికి వెళ్ళిపోయాడు. అవి తన కష్టార్జితం కాదని తండ్రికి ఎలా తెలిసిందో సోమన్నకు అంతుబట్టలేదు.

మర్నాడు శేషమ్మ తన కొడుకుతో, "ఇవాళయినా ఎక్కడన్నా కష్టపడి డబ్బు సంపాదించుకొచ్చి మాట నిలబెట్టు, నాయనా!" అన్నది.

తల్లి అవతలికి వెళ్ళగానే సోమన్న కొయ్యపెట్టెలో నుంచి ఒక రూపాయి తస్కరించి, ఊళ్ళో మిఠాయి దుకాణానికి వెళ్ళి, ఒక పావలా పెట్టి పకోడీలూ, జీడిపప్పు పాకమూ కొని తిని, మిగతా ముప్పావలా డబ్బులూ జేబులో వేసుకుని, పొద్దు పోయే దాకా ఊరంతా తిరిగి, తండ్రి ఇంటికి వచ్చే వేళకు తాను కూడా ఇంటికి వచ్చి, "ఇదుగో నా సంపాదన! ముప్పావలా!" అంటూ తండ్రి చేతిలో పెట్టాడు.

కామయ్య కిందటి రోజులాగే ఆ డబ్బులను పరీక్షగా చూసి, "ఛీ, ఇవి నీ కష్టార్జితం



కాదు!" అంటూ వాటిని కూడా పొయిలోకి విసిరాడు.

ఈసారి సోమన్నకు నిజంగా పౌరుషం వచ్చింది. ఎలాగైనా మూడు పావలాలూ సంపాదించకుండా తండ్రి కంట పడగూడదనుకున్నాడు. ఆ రోజే పొరుగూళ్ళో సంత ఉన్నది. సోమన్న అక్కడికి వెళ్ళి మూటలు మోసి, కూలి డబ్బులు సంపాదించాడు. రోజల్లా బరువులు మోసినా మూడు పావలాలు కాలేదు. మర్నాడు కూడా వాడు ఆ వూళ్ళోనే ఉండి, బళ్ళఘాటీ దగ్గిర కూలి పని చేసి, రోజల్లా కష్టపడితే రెండు రోజుల ఆర్జనా కలిసి మూడు పావలాలయింది. ఆ రాత్రికి వాడు ఇంటికి చేరుకుని, "నా సంపాదన చూసుకో!" అంటూ మూడు పావలాలూ తండ్రి కిచ్చాడు.

కామయ్య వెనకటిలాగే ఆ డబ్బుల కేసి చూసి, "ఛీ, ఇది నీ కష్టార్జితం కాదు!" అంటూ పొయ్యిలోకి విసిరాడు.

సోమన్న కెవ్వున అరిచి వెళ్ళి, తన డబ్బులను పొయిలో నుంచి బయటికి లాక్కున్నాడు.

"నిజమే! ఈసారి ఈ డబ్బులు నీ కష్టార్జితమే! కాని ఈ మూడు పావలాల కోసం ఎన్నాళ్ళు శ్రమపడ్డావు? ఎంత శ్రమ పడ్డావు?" అని కామయ్య ఎంతో ప్రేమగా కొడుకు నడిగాడు.

"రెండు రోజులపాటు బరువులు మోశాను," అన్నాడు సోమన్న తల వంచుకుని.

"నీ సొంత దుకాణం మీద నువు శ్రమ పడితే దానికి పదింతలు సంపాదించే పని కాదుట్రా? మూటలు మొయ్యటం పరువైన పనా?" అన్నాడు కామయ్య.

సోమన్నకు జ్ఞానోదయ మయింది. వాడు మర్నాటి నుంచీ తండ్రికి కమ్మరం పనిలో సహాయం చేస్తూ, తండ్రికి శక్తి ఉడిగిపోయే లోపల మంచి పనివాడుగా తయారయాడు.



# పిచ్చిలో రకాలు

ఒక ఊళ్ళో ఒకడు ఉండెవాడు. వాణ్ణి అందరూ పిచ్చివాడనేవారు. వాడు అనే మాటలూ, చేసే పనులూ అర్థం లేనట్టుండేవి. కాని ఒక్కొక్కసారి వాడి పిచ్చిమాటలలో సూక్ష్మమైన తెలివితేటలు కూడా ఉండేవి.

ఒకనాడు ఉదయం వాడు నదీతీరానికి వచ్చాడు. అక్కడ ఒక బ్రాహ్మడు నడుము లోతు నీటిలో ఉండి, దోసిట్లో నీరు తీసుకుని సూర్యుడి కేసి తిరిగి ఏదో మంత్రాలు చదువుతూ, ఆ నీటిని నదిలోకి జార విడుస్తున్నాడు.

"అయ్యా, మీ రెందు కలా చేస్తున్నారు?" అని పిచ్చివాడు ఆ బ్రాహ్మణ్ణి అడిగాడు.

"సూర్యుడికి అర్ఘ్యం ఇస్తున్నాను," అన్నాడు బ్రాహ్మడు.

వెంటనే పిచ్చివాడు తాను కూడా నదిలోకి దిగి, సూర్యుడికి వీపు పెట్టి, దోసిట్లో నీళ్లు ఎత్తి నదిలో విడవసాగాడు.

"నువేం చేస్తున్నావు?" అని బ్రాహ్మడు పిచ్చివాణ్ణి అడిగాడు.

"మా తోటకు నీరు పోస్తున్నాను. అది పడమరగా ఉంది," అన్నాడు పిచ్చివాడు.

"నువ్విక్కడ నీరు పోస్తే మీ తోట ఎలా తడుస్తుందోయీ, పిచ్చివాడా?" అన్నాడు బ్రాహ్మడు నవ్వుతూ.

"కోటి మైళ్ళ దూరంలో ఉన్న సూర్యుడికి మీ అర్ఘ్యం చేరగా లేనిదీ, పదిమైళ్ళ దూరాన ఉండే మా తోటకు నేను పోసే నీరు అందదా?" అని పిచ్చివాడు అడిగాడు.

—ఎం. విశ్వభారతి





# భార్యాభర్తలు

ఒక ఊళ్ళో రామయ్యా, రాధమ్మ అనే దంపతు లుండేవారు. వారు సంపన్నులే గాని వారికి ఎంత కాలానికీ సంతానం కలగలేదు. సంతానం కోసం వారు అనేక వ్రతాలు చేసి, చివరకు తీర్థయాత్రలు చేస్తూ బయలు దేరారు. వారు కాశీలో గంగాస్నానం చేస్తూ ఉండగా రాధమ్మ కేసి ఒక పళ్ళెం తేలుతూ వచ్చింది.. ఆమె దాన్ని అందుకుని చూస్తే ఆ పళ్ళెంలో కొద్దిగా పసుపు నీళ్ళూ, అందులో కదులుతూ ఒక పాముపిల్లా ఉన్నట్టనిపించింది. కాని మళ్ళీ చూస్తే అది పాముపిల్ల కాదనీ, పాము ఆకారంలో ఉన్న ఆభరణమనీ తెలిసింది. అది గంగా దేవి తన కిచ్చిన కానుక అనుకుని రాధమ్మ ఆ పళ్ళాన్ని తన బసకు తీసుకుపోయి, పూలతో పూజించింది.

అయితే మర్నాడు ఉదయం ఆమె తనకు దొరికిన పళ్ళాన్ని చూస్తే అందులో నాగా భరణానికి మారుగా ఒక చక్కని మగబిడ్డ కనిపించాడు. రాధమ్మ అమితానందంతో ఆ బిడ్డను ఇంటికి తెచ్చుకుని, తన బిడ్డ లాగే పెంచుకుని, తనకు సంతానం లేని కొరత తీర్చుకున్నది. ఆ పిల్లవాడికి తల్లి దండ్రులు ముద్దుగా గంగాదత్తు డని పేరు పెట్టుకున్నారు.

గంగాదత్తుడు పెరిగి పెద్దవా డయాడు. అతను చాలా బుద్ధిమంతుడు. మంచి కొడుకు అనిపించుకున్నాడు. యుక్తవయసు రాగానే అతనికి సుందరి అనే చక్కని కన్య నిచ్చి పెళ్ళి చేశారు.

గంగాదత్తుడికి వివాహం జరిగిన కొద్ది రోజులకు ఒక ముసలిది సుందరి దగ్గిరికి వచ్చి, తనకు ఎవరూ లేరనీ, తనను తిండి పెట్టి పోషించినట్టయితే చాతనైన పనులు చేస్తూ కనిపెట్టి ఉంటాననీ వేడుకున్నది. సుందరి ఆ ముసలిదాన్ని చూసి జాలిపడి

సి. వసుంధర



ఆమె కోరిక ప్రకారం తనవద్ద ఉండనిచ్చింది. ముసలిది సుందరికి వింత వింత కథలూ, కబుర్లూ చెబుతూ, త్వరలోనే ఆమె విశ్వాసాన్ని చూరగొన్నది.

ఒక రోజు ముసలిది మాటల సందర్భంలో, "నువ్వూ, నీ భర్తా చాలా అన్యోన్యంగానే ఉంటున్నారు గాని, అతన్ని గురించి నీకు ఏమీ తెలీదు. నువ్వు చాలా అమాయకురాలివి," అన్నది.

సుందరి పౌరుషంగా, "నా భర్తను గురించి నాకు సమస్తమూ తెలుసు. ఆయన మనసులో ఉండే ప్రతి చిన్న విషయమూ నే నెరుగుదును," అన్నది గర్వంగా.



ముసలిది నవ్వి, "నీకు నీ భర్త అసలు పేరు కూడా తెలీదు," అన్నది.

"అంత చోద్యంగా మాట్లాడకు. ఆయన పేరు గంగాదత్తుడు కాదా?" అని సుందరి అడిగింది.

"కాదు. అతని అసలు పేరేమిటో మన కెవరికీ తెలీదు. నువ్వు అడిగిచూడు. నీ మీద నిజంగా ప్రేమ ఉన్నవాడైతే చెప్పకపోతాడా? ఆ పేరుతోబాటు నీ భర్తను గురించి ఇంకా ఎన్నో అద్భుత విషయాలు తెలుస్తాయి," అన్నది ముసలిది.

ఆ రాత్రి సుందరి, "ఏమండీ, మీ అసలు పేరేమిటో చెప్పరూ?" అని అడిగింది.

గంగాదత్తుడు ఆ మాటకు తుళ్ళిపడి, "నా అసలు పేరా? అడగకు! అడగకు!" అన్నాడు కంగారుగా.

అతనికి వేరే పేరున్నదని సుందరికి రూఢి అయిపోయింది. అతని చేత ఆ పేరు చెప్పించాలన్న పట్టుదల కూడా పుట్టుకొచ్చింది. చెప్పితీరాలని ఆమె పంతం పట్టింది. అతను ఎంతసేపూ, "ఆ మాట అడగకు!" అన్నాడే తప్ప, తన అసలు పేరు చెప్పనేలేదు. తెల్లవారిసదాకా ఇద్దరూ పట్టు విడవలేదు.





తెల్లవారగానే గంగాదత్తుడు సుందరితో, "నేను నీకు నా అసలు పేరు చెప్పే తీరాలా? నీ పట్టు విడవవా?" అన్నాడు.

"చెప్పి తీరాలిసిందే! చెప్పరాదని మీకా పట్టుదల దేనికి?" అన్నది సుందరి.

"అయితే నా వెంటరా!" అంటూ అతను తమ తోటలో ఉన్న కొలను దగ్గిరికి దారి తీశాడు. సుందరి అతని వెంట వచ్చింది.

"ఇప్పటికైనా మించిపోలేదు. నీ ఉద్దేశం మార్చుకుంటావా?" అన్నాడు గంగాదత్తుడు.

"చెబుతానని తీసుకువచ్చి, మళ్ళీ ఇదేమిటి? ఏమైనాసరే, మీరు నాకు మీ అసలు పేరు చెప్పితీరాలి!" అన్నది సుందరి మొండిగా.

"నేను నాగపుత్రుణ్ణి. నా అసలు తండ్రి నాకు నామకరణం చెయ్యలేదింకా!" అంటూ గంగాదత్తుడు కొలనులోకి దూకేశాడు.

సుందరి గుండె గుభేలుమన్నది. ఆమె పెద్దపెట్టున ఏడుస్తూ, "బుద్ధి తక్కువ అయింది! చెంపలేసుకుంటాను. బయటికి రండి!" అంటూ కొలను చుట్టూ తిరగ సాగింది.

అప్పుడు ముసలిది వచ్చి ఆమెను ఊరడిస్తూ, "జరిగిన సంగతి చెబుతాను విను.



నేను కూడా నాగ స్త్రీనే. నీ భర్త ఒక నాగ రాజు కొడుకు. పుట్టటమే జీవం లేకుండా పుట్టాడు. సూర్యరశ్మి సోకితే చైతన్యం వస్తుందని నేనే ఆ బిడ్డను ఒక పళ్ళెంలో గంగ కుండా భూమిపైకి తెచ్చాను. కాని నా ఏమరుపాటువల్ల పళ్ళెం గంగా ప్రవాహంలో కొట్టుకుపోయింది. ఎంత వెతికినా దొరక లేదు. నాగరాజు నాపైన చాలా కోప్పడ్డాడు. అతను మనిషిస్పర్శ వల్ల మనిషిగా మారి ఇక్కడ పెరుగుతున్నట్టు ఇటీవలనే తెలిసింది. అతన్ని తీసుకు రమ్మని నాగరాజు నన్ను పంపాడు. అతని అసలు పేరు అడిగినట్టయితే జన్మస్ఫురణ కలిగి, పాతాళానికి



వచ్చేస్తాడని నీ చేత అడిగించాను. నేను వచ్చిన పని తీరిపోయింది," అంటూ ముసలిది కూడా మడుగులోకి దూకింది.

సుందరి సమయస్ఫూర్తితో ముసలిదాని చెంగు పట్టుకుని, తాను కూడా మడుగులోకి దూకింది. ఇద్దరూ పాతాళం చేరాక ముసలిది, "సాహసం చేసి నువ్వు కూడా వచ్చేశావా? ఇక్కడే ఉండు. నీ భర్త ఏ స్థితిలో ఉన్నాడో చూసి వస్తాను," అని వెళ్ళిపోయింది.

కాస్సేపటికి ఆమె తిరిగి వచ్చి, "నీ భర్త ఈ పక్కనే గదిలో నిద్రపోతున్నాడు. అతని పక్కనే కాస్సేపట్లో అతని తల్లి భోజనం పెట్టిపోతుంది. నువ్వు వెళ్ళి గదిలో దాక్కో. అతను తిని వదిలేసిన ఆహారాన్ని అతను లేకుండా చూసి తినెయ్యి. తరవాత అతని ఎదటపడి, ఏం చెప్పుకుంటావో, ఎలా అతన్ని వశపరుచుకుంటావో, అదంతా నువ్వే చూసుకో," అన్నది.

ముసలిది ఆమెను గంగాదత్తుడు నిద్రపోతున్న గదిలోకి పంపింది. సుందరి ఆ గదిలోనే ఒక రహస్య ప్రదేశంలో దాక్కున్నది. ముసలిది చెప్పినట్టే నాగరాజు భార్య పళ్ళెంలో భోజనం తెచ్చి, నిద్రపోతున్న వాడి సమీపంలో పెట్టి వెళ్ళిపోయింది.

కొంత సేపటికి అతను లేచి ఆహారం చూసి, తినటం ప్రారంభించాడు. కాని అతనికి ఏమీ సయించినట్టు లేదు. కొద్దిగా తిని, చెయ్యి కడుక్కోవటానికి వెళ్ళిపోయాడు. వెంటనే సుందరి తాను దాగిన రహస్యప్రదేశం నుంచి ఇవతలికి వచ్చి, అతను వదిలేసిన ఆహారం తిని, మళ్ళీ వెళ్ళి దాక్కున్నది.

గంగాదత్తుడు తిరిగి వచ్చి, ఖాళీ పళ్ళెం చూసి, "ఏమిటిది? ఈ పళ్ళెం ఎవరు ఖాళీ చేశారు?" అన్నాడు పైకే.

"నేనే!" అంటూ సుందరి అతని ఎదటికి వచ్చి, "నన్ను క్షమించండి. మీతో

బాటు నన్ను కూడా ఇక్కడే ఉండ నివ్వండి," అని బతిమాలుకున్నది.

ఆమెను చూడగానే అతనికి సంతోష మయింది గాని, మరుక్షణమే విచారంగా, "అది ఎలా సాధ్యం? నువు మనిషివి. నా తండ్రి చండశాసనుడు. నిన్నిక్కడ చూస్తే ప్రాణాలతో విడవడు. నిన్ను ముందు ఎక్కడన్నా దాయాలి!" అన్నాడు.

సుందరి తల వంచుకుని దిగులుగా, "నన్ను ఎక్కడ దాస్తారు? ఎంత కాలం దాస్తారు? నేను చేసిన పాపానికి నేనే శిక్ష పొందాలి. మీరు నన్ను క్షమిస్తే చాలు, మీ తండ్రి నన్ను చంపినా నాకేమీ అభ్యం తరంలేదు. ప్రాణం కాపాడుకోవటానికి నేనీ లోకం వదిలి మటుకు పోను!" అన్నది,

గంగాదత్తుడు కొంచెం ఆలోచించి, "ఈ చిక్కు నీది మాత్రమే కాదు, నాది కూడానూ. నువ్విక్కడే ఉండు," అంటూ వెళ్ళిపోయాడు.

అతను తిన్నగా నాగరాజు వద్దకు వెళ్ళి, "నా కోసం నా భార్య కూడా వచ్చేసింది. ఆమెకు మీరు ఏ శిక్ష విధిస్తారో, నాకూ అదే విధించండి. ఎందుచేతనంటే, నన్ను విడిచి ఆమె ఉండలేనట్టే, ఆమెను విడిచి నేనూ ఉండలేను. ఇక్కడికి చేరాక నాకు తిండి కూడా సయించలేదు," అన్నాడు.

నాగరాజు తన కొడుకు కేసి చాలాసేపు చూసి, "చాలాకాలం మనిషి లోకంలో ఉండి, నీలో నాగలక్షణాలు లేకుండా పోయాయి. అందుకే మానవ భార్య కోసం తపించిపోతున్నావు. నువు కోరినట్టు మీ ఇద్దరికీ ఒకటే శిక్ష ఇస్తాను. మీరిద్దరూ తిరిగి మానవలోకానికి వెళ్ళిపొండి," అన్నాడు.

నాగరాజు తన కొడుకునూ, కోడలినీ భూమిపైకి ఊరికే పంపలేదు, బోలెడన్ని రత్నాలు కానుక లిచ్చి మరీ పంపాడు. తరవాత గంగాదత్తుడూ, సుందరీ సుఖంగా జీవించారు.



# ఎవరు మంత్రి?

ఒక రాజుగారి ప్రధానమంత్రి ఆకస్మికంగా చనిపోయాడు. అయన కింద ఉపమంత్రులు ముగ్గురుండేవారు. వారిలో ఎవరిని ప్రధానమంత్రిని చెయ్యటమా అన్నది రాజుకు సమస్య అయిపోయింది. ఏ ఒకరికి ఆ పదవి ఇచ్చినా మిగతా ఇద్దరికీ అన్యాయం జరగవచ్చు. ముగ్గురిలోనూ ప్రధానిపదవికి అర్హుడెవరో రాజు తేల్చలేకపోయాడు.

కొద్ది రోజులు గడిచాక రాజు సపరివారంగా నదీతీరానికి వెళ్ళాడు. అయన వెంట ఉప ప్రధానులు ముగ్గురూ ఉన్నారు. అందరూ నది ఒడ్డున కూర్చుని సరదాగా కాలక్షేపం చేస్తూండగా రాజు నది ఎగువకు చూసి, "నీటిలో ఏదో కొట్టుకు వస్తున్నది. అదేమిటై ఉంటుంది?" అన్నాడు ఉపమంత్రులతో.

ముగ్గురిలో ఒకడు కళ్ళ మీద చేయిపెట్టి పరకాయించి చూసి, "ఏదో పండులా గుంది," అన్నాడు.

మరొకడు లేచి నిలబడి చూసి, "అవును, మహారాజా! మామిడిపండు," అన్నాడు.

ఈ లోపల మూడోవాడు లేచి, తన కోటూ, తలపాగా తీసి ఒడ్డున పారేసి, నదిలోకి దూకి, ఈదుకుంటూ వెళ్ళి, ఈ లోపల సమీపానికి వచ్చిన మామిడిపండును తీసుకుని, మళ్ళీ ఈదుకుంటూ వచ్చి, పండును తెచ్చి రాజుగారికిచ్చాడు.

కార్యశూరుడైన ఆ ఉపమంత్రిని రాజు ప్రధానిగా నియమించాడు.





# జ్ఞానబోధ

గోవర్ధన పర్వతం మీద ఒక మునీశ్వరుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన పేరు శమనకుడు. జన్మసార్థక్యం తప్ప శమనకుడికి వేరే కోరిక ఏదీ లేదు. తపస్సు ప్రారంభించక పూర్వం ఆయన అనేకరకాల తత్వవేత్తలతో చర్చించాడు. కాని అందువల్ల జన్మసార్థక్యం కలుగుతుందని తోచలేదు. తపస్సు ద్వారా సాధించరానిది లేదని ఎవరో చెప్పగా శమనకుడు గోవర్ధన పర్వతం మీదికి వెళ్ళి అతి కఠోరమైన తపస్సు సాగించాడు. ఒంటి కాలి మీద నిలబడి, ఎండనూ, వాననూ, చలినీ లక్ష్యపెట్టక, జల భక్షణా, వాయు భక్షణా చేస్తూ తపస్సు చేశాడు. అప్పటికీ శమనకుడికి జన్మసార్థక్యం కలుగుతున్న దనిపించలేదు. తపస్సు వల్ల ఆయన మనసు ఆత్మానందంతో నిండటానికి బదులు, నిరాశతోనూ, ఆందోళనతోనూ నిండిపోయింది.

ఒకనాడు శమనకుడు నిద్రపోతూండగా ఆయన కళ్ళ ఎదట ఒక గొప్ప తేజస్సు కనబడింది. అందులో నుంచి కొన్ని మాటలు వినిపించాయి :

"నాయనా, తపస్సు చాలించి, జ్ఞానం సంపాదించు. కొండ దిగి తూర్పుగా వెళ్ళు. ఝాము పొద్దెక్కే లోపుగా నీ కొక పశువుల కాపరి కనిపించి, జ్ఞానబోధ చేస్తాడు."

ఈ మాటలు పలికి తేజస్సు అంతర్ధానమయింది. శమనకుడు లేచి కూర్చుని తూర్పు దిక్కుగా చూశాడు. అప్పుడప్పుడే అరుణోదయం అవుతున్నది. శమనకుడు కొండ దిగి, సూటిగా సూర్యోదయం కేసి నడిచాడు. కొంతదూరం వెళ్ళాక ఒక కొండ వాగు తగిలింది. శమనకుడు అందులో స్నానం చేసి, మళ్ళా ప్రయాణం సాగించాడు.

సూర్యోదయమైన కొంతసేపటికి శమనకుడికి అస్పష్టంగా పిల్లనగ్రోవి ధ్వని విని

ఆర్. వెంకటదాసు




పించింది. తరవాత కొద్ది సేపటికే ఒక ఆవులమంద వస్తూ కనబడింది. ముందున్న ఆవుల్లో ఒక దాని మీద ఒక చిన్న పిల్ల ఎక్కి ఉన్నది. ఆ పిల్ల వయసు ఆరేడేళ్ళ కన్న ఎక్కువవుండదు.

ఆమె శమనకుడి కేసి కళ్ళు పెద్దవి చేసి చూసింది. కఠోర తపస్సు చేసి కృశించిన శమనకుడు, గడ్డాలూ, మీసాలూ పెరిగి, జుట్టు అట్టలు కట్టుకుపోయి, చూడటానికి భయంకరంగా ఉన్నాడు.

శమనకుడు ఆ పిల్లను గమనించలేదు. ఆయన కళ్ళు పశువులకాపరి కోసం వెతుకుతున్నాయి.



ఆ పశువుల మందకు వెనకగా, పిల్లనగ్రోవి ఊదుకుంటూ పశువులకాపరి వచ్చాడు. అతని వయస్సు ఇరవైకి మించదు. ముతక గుడ్డలు కట్టుకుని మొరటుగా ఉన్నప్పటికీ, అతను స్ఫురద్రూపిగానే ఉన్నాడు.

పశువులకాపర్ని చూడగానే శమనకుడు అతని కేసి వేగంగా నడిచాడు. శమనకుడు తనను సమీపించటం చూసి పశువులకాపరి పిల్లనగ్రోవి వాయించటం నిలిపేశాడు. గోవర్ధనం మీద ఒక మహాత్ముడు తపస్సు చేసుకుంటున్నట్టు విని ఉండటం చేత, అతను శమనకుణ్ణి చూస్తూనే ఆ ఋషీశ్వరుడే అయి ఉంటాడనుకున్నాడు.

శమనకుడు పశువులకాపరికి వినయంగా నమస్కారం చేసి, "బాబూ, ఎంత తపస్సు చేసినా నాకు దొరకని ఆత్మానందం నీకు దొరికింది. నువ్వు ధన్యుడివి. నాకు కూడా అలాటి ఆనందం కలిగేమార్గం ఉపదేశించి, నా జన్మ సార్థకమయేటట్టు చెయ్యి." అని అడిగాడు.

పశువులకాపరి ముఖం జేవురించింది. అతను కొంచెం కోపంతో, "తమరు పెద్దలు. నా బోటి పామరుణ్ణి అవమానించటం తగని పని!" అన్నాడు.

"నిన్ను అపమానించటమూ లేదు, అపహాస్యం చెయ్యటమూ లేదు, బాబూ. నీ ద్వారా జ్ఞానబోధ పొందమని ఉత్తరు వయింది. నేను వస్తున్నది కూడా నీ కోసమే. నువు ఏమి కృషి చేసి ఇంతటి జ్ఞానం పొందావో తెలిపినా చాలు, నేను కూడా అలాగే కృషి చేస్తాను," అన్నాడు శమనకుడు. పశువులకాపరికి ఇదంతా అయోమయంగా ఉంది.

"స్వామీ, పొట్ట పొడిచినా అక్షరం ముక్క లేనివాణ్ణి. నాకు జ్ఞానమేమిటి? దాని కోసం కృషి చెయ్యటమేమిటి? నేను బుద్ధెరిగి నప్పటినుంచీ పశువులను కాసుకుంటున్నాను. వాటిని ఒక బీడు నుంచి ఇంకో బీడుకు తోలుకుంటూ పోతాను. ఏ పశువుకూ రోగమూ, రొష్టూ రాగూడదని దేవుడికి దణ్ణాలు పెట్టుకుంటాను. ఇంత కన్న నేను చేసింది ఏమీ లేదు," అన్నాడు పశువులకాపరి.

"కాదు, కాదు, ఇంకేదో ఉండి ఉంటుంది. నువు అణకువ కొద్దీ దాస్తున్నావు," అన్నాడు శమనకుడు.

"ఏమీ దాయలేదు, స్వామీ. అదుగో, ఆ పిల్ల వయసప్పటి నుంచీ నేను పశువులు కాయటం తప్ప ఇంకేమీ చెయ్యనే లేదు. నా తండ్రి ఈ పనే చేసేవాడు. నాకూ కూడా



ఈ పనే నేర్పాడు. నెనిప్పుడీ ఎల్లకు నేర్పుతున్నట్టే!" అన్నాడు పశుపులకాపరి.

"అది ఎవరు? నీ చెల్లెలా? లేక నీ కూతురేనా?" అని శమనకుడు అడిగాడు.

"ఇప్పుడది నాకు చెల్లెలనుకోవచ్చు, కూతురనుకున్నా అనుకోవచ్చు. కాని నిజానికి అది నాకు రెండూ కాదు. అది చంటిపిల్ల అయి ఉండగా వాళ్ళింట దొంగలుపడి, దాని తండ్రినీ, తల్లినీ చంపేసి, పసిగుడ్డును మాత్రం ప్రాణాలతో వదిలిపోయారు. ఆ స్థితిలో అది నాకు దొరికింది. పాపం, కళ్ళు తెరవని పసికందు!" అన్నాడు పశువులకాపరి.

"దాన్ని తెచ్చి, పెంచటానికి మీ అమ్మకో, నీ భార్యకో ఇచ్చావన్నమాట!" అన్నాడు శమనకుడు.

"లేదు. నేనే పెంచాను. అప్పటికే మా అమ్మ పోయింది. నాకు పెళ్లి కాలేదు. నా పెంపకంలోనే అది ఏపుగా, గుమ్మడి కాయలాగా, పెరిగి ఇంతదయింది. తమరు చూశారుగా?" అన్నాడు పశువులకాపరి.

"అప్పటికి నువే చాలా చిన్న వాడివేమో?" అని శమనకుడు అడిగాడు.

"చిన్నవాణ్ణే. అయితేనేం? బలంగా, ఈ లావున ఎద్దులాగుండేవాణ్ణి," అన్నాడు పశువులకాపరి.





"ఆ పిల్లను సాకటం నీకు కష్టం కాలేదా?" అని శమనకుడు అడిగాడు.

"కష్టమన్న కష్టమా? నోరూ, వాయీ లేని ముండ! ఏడిస్తే ఏ కడుపు నొప్పో, కాలు నొప్పో తెలిసేది కాదు. ఎన్ని జబ్బులు! ఎంతయాతన!" అన్నాడు పశువులకాపరి.

"దానితో ఈ కష్టాలన్నీ ఎందుకు పడ్డావు? ని కష్టానికి ఏం ప్రతిఫలం ఆశించావు?" అని శమనకుడు అడిగాడు.

పశువులకాపరి ఆయన కేసి ఒక క్షణం పాటు వింతగా చూసి, "ప్రతిఫలమా? అది పెరిగి పెద్ద కావటం ప్రతిఫలం కాదూ? దాన్ని ఎత్తుకుని తిరగలా? ఆడించలా? దాని చేత తప్పటడుగులు వేయించి, నడపటం నేర్పలా? దానికి ఒక్కొక్క విద్యే నేర్పలా? దానికి పశువులు కాయటం చెప్పలా? ఇదంతా ప్రతిఫలం కాదూ? దాన్ని పెంచటం మొదలు పెట్టాక ఒక్క రోజు బీరు పోయిందా?" అన్నాడు.

శమనకుడు కళ్ళ వెంట జలజలా కన్నీరు కార్చసాగాడు.

"నీ జన్మ ఎట్లా సార్థకమయిందో, ఆత్మానందం ఎలా కలిగిందో నాకు అర్థమయింది, నాయనా! పసితనం లోనే నీకు ప్రేమ తత్వం అలపడింది. నిస్వార్థంగా మరొకరి కోసం కష్టపడటంలోగల ఆనందాన్ని తెలుసుకున్నావు. దాన్ని నేను క్షుద్రంగా భావించి అంధకారంలో పడ్డాను. ఇంత ముసలితనంలో నాకు జ్ఞానోదయం కలిగింది. భగవంతుడు అనుగ్రహించి నాకు ఆయువిస్తే, ఇంటికి వెళ్ళి నా ఆత్మానందాన్ని వెతుక్కుంటాను," అంటూ శమనకుడు వెనుదిరిగి బయలుదేరాడు.

"ఈ ఋషీశ్వరులు ఏం చిత్రంగా మాట్లాడతారు! ఒక్క ముక్కా అర్థంకాదు గదా," అనుకుంటూ పశువులకాపరి తన పిల్లనగ్రోవి తీసి, తియ్యగా వాయించనారంభించాడు.






# ఉపకారులు

పూర్వం ఒక రాజ్యాన్ని ఉపేంద్రవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయనకు ఇద్దరు భార్యలయందు ఇద్దరు కొడుకులు కలిగారు. ఇద్దరూ ఇంచు మించు ఒకే వయసు గల వారు. పెద్దవాడి పేరు నాగవాహనుడు, చిన్న వాడి పేరు పశుపతి. నాగవాహనుడు కాస్త కఠినుడు. పశుపతి మనసు చాలా మృదువు. అయినా ఇద్దరూ అన్యోన్యంగానే పెరిగి పెద్ద వారయారు.

ఇద్దరికీ యుక్త వయసు వచ్చింది. దేశాటన చేసి, తమకు నచ్చిన కన్యలను పెళ్ళాడి తిరిగి వస్తామని చెప్పి, రాజకుమారులిద్దరూ తమ ఇంటి నుంచి బయలుదేరారు. వాళ్ళు చాలా దేశాలు గడిచి, ఒక అందమైన వనాన్ని చేరారు. అక్కడ ఒక సరోవరం ఉన్నది. అందులో హంసలున్నాయి.

ఇద్దరూ సరోవరంలో స్నానం చేసి, సమీపంలో ఉన్న చెట నుంచి రుచికరమైన పళ్ళు కోసుకుని తిని, సరోవరం తీరాన కూర్చున్నారు. అప్పుడు నాగవాహనుడికి ఒక హంసను బాణంతో కొట్టాలనిపించింది. అతను విల్లు ఎత్తటం చూసి పశుపతి అతన్ని వారిస్తూ విల్లు లాగేసుకుని, "ఊరుకో! అందమైన హంసలను అనవసరంగా చంపితే ఏం వస్తుంది?" అన్నాడు.

"వేటలో వినోదం లేదా? విల్లు ఇలా ఇయ్యి," అన్నాడు నాగవాహనుడు.

"ఇది వేట కాదు, హత్యే!" అన్నాడు పశుపతి.

తరవాత వాళ్ళు అక్కడ తిరుగుతూండగా ఒక చీమలపుట్ట కనిపించింది. కాస్తంత చీమలు ఎంతో చాకచక్యంగా తమ ఇంటిని నిర్మించుకున్నాయి. అవి విరామం లేకుండా పుట్టలోకి పోతూండటమూ, పుట్ట నుంచి బయటికి వస్తూండటమూ గమనించి పశుపతి చాలా ఆనందించాడు.

హెచ్. రాజేశ్వరరావు



"పుట్ట లోపల చూస్తే నీ కింకా ఆనందంగా ఉంటుంది," అంటూ నాగవాహనుడు ఒక పుల్లతో చీమలపుట్టను చెరపబోయాడు. పశుపతి అతని చెయ్యిపట్టుకుని, పుల్లను అవతల పారేసి, "ఎందుకు చీమలను అకారణంగా హింసిస్తావు?" అన్నాడు.

"నువ్వెక్కడ దాపరించావురా? పిరికి వాడివి!" అని నాగవాహనుడు చాలా చిరాకు పడిపోయాడు.

వాళ్ళు మరి కొంతదూరం వెళ్ళాక పూల నుంచి మకరందాన్ని సంగ్రహించే తేనెటీగలు చెట్ల మీద కనిపించాయి. నాగవాహనుడు వాటి మీదికి బట్ట విసిరి కొన్ని తేనెటీగలను పట్టుకుని, "చిక్కాయి పాపిష్టివి! ఇవి కుట్టితే ఎంత బాధో తెలుసా? వీటిని ఏం చేసినా పాపం లేదు," అంటూ తన బట్టలో చిక్కిన తేనెటీగలను చిత్రహింస చేయబోయాడు.

పశుపతి అతని చేతిలోని బట్టను లాగేసి, "నువు వాటి జోలికి పోకపోతే అవి నిన్నెందుకు కుట్టుతాయి? ఎందుకు చేస్తా విలాటి పన్లు?" అన్నాడు.

నాగవాహనుడికి చాలా కోపం వచ్చింది. "నన్ను ఒక్క పనీ సరదాగా చెయ్యనివ్వవు! నా యిష్టం కాదనటానికి నువ్వెవడివి? ఇక నేను నీతో రానేరాను," అంటూ అతను తన గుర్రాన్నెక్కి అతి వేగంగా వెళ్లిపోయాడు. పశుపతి వెనక నుంచి కేకలు పెట్టినా వినిపించుకోలేదు.



పశుపతి కూడా అన్న వెళ్ళిన దారినే బయలు దేరాలని తన గుర్రం మీద ఎక్కబోతూండగా, "అయ్యా! బాబూ! నాయనా!" అని మూడు గొంతులు పిలవటం వినబడింది. అతను ఆశ్చర్యంతో వెనక్కు తిరిగి చూశాడు. ఒక హంసా, పెద్ద చీమా, తేనెటీగల రాణీ అతన్ని సమీపించాయి.

"నువు మా పట్ల చూపిన ఆదరానికి మేం కృతజ్ఞులం. నువు ఎక్కడ ఉన్నా,



మాతో పని పడినప్పుడు మాలో ఎవరిని తలుచుకుంటే వాళ్ళం వచ్చి, నీకు కావలిసిన సహాయం చేస్తాం!" అన్నాయి అవి.

పశుపతి ఆ మాటకు చాలా సంతోషించి, గుర్రం మీద బయలుదేరాడు. రెండు రోజులపాటు అతను అరణ్యమార్గాన ప్రయాణించి ఒక పెద్ద భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనం ముందు ఒక చెరువు ఉన్నది. దాని గట్టున మూడు మందార చెట్లున్నాయి. అవి కాక ఆ ప్రాంతంలోనే కొన్ని ఎండిపోయిన చెట్లు కూడా ఉన్నాయి. మందార చెట్ల సమీపంలో ఒక వృద్ధుడు నేల మీద కూర్చుని ఉన్నాడు.



పశుపతి భవనద్వారం ముందు గుర్రాన్ని దిగి, లోపలికి ప్రవేశించబోయాడు. అప్పుడు వృద్ధుడు, "అటు వెళ్ళకు. ఇలా రా. ఆ భవనంలో నీకేమీ పని లేదు. నీ దారిన నువు వెళ్ళు," అన్నాడు.

పశుపతి వృద్ధుణ్ణి సమీపించి, "ఎందుకలా అన్నావు? ఈ భవనం ఎవరిది? నువ్వెవరు?" అని ప్రశ్నించాడు.

వృద్ధుడు ఇలా చెప్పాడు:

"ఈ భవనం కథ వింటావా? ఇది ఒక రాజుది. ఆ రాజుకు ఇద్దరు కుమార్తెలూ, ఒక కొడుకూ ఉండేవారు. ఆడపిల్లలు కవలలు. ఇద్దరూ ఒకే రూపులో ఉండేవారు. పెద్దదాని పేరు సువర్ణ. రెండోదాని పేరు మధురవాణి. కుమారుడు వాళ్ళ కన్న చిన్నవాడు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళవుతూండగా ఒకనాడొక యోగి రాజభవనానికి భిక్షకు వచ్చాడు. ఆ యోగిని రాజకుమారుడూ, కుమార్తెలూ కాస్త అల్లరిపెట్టారు. రాజకుమారుడు ఒక చిన్న పెట్టె చూపి, దాని తాళపుచెవిని ఈ చెరువులోకి విసిరివేసి, 'నువు యోగశక్తితో చెరువు నుంచి తాళపుచెవి తెచ్చి, ఈ పెట్టె తెరిచి, ఇందులో ఏమున్నదో చెప్పు,' అన్నాడు. సువర్ణ తన ముత్యాలహారం తెంచి, ముత్యాలన్నీ విర





జిమ్మి, 'ఎన్ని ముత్యా లున్నాయో లెక్క పెట్టి, వాటిని ఒక చోట చేర్చి, మళ్ళీ హారం ఎప్పటి లాగా చెయ్యి,' అన్నది. మధురవాణి, 'మా ఇద్దరిలో చిన్నది ఎవరో పెద్దది ఎవరో చెప్పు. నువ్వీ పనులు చేసినట్టయితే నీకు భిక్ష పెడతాం,' అన్నది. యోగి మండిపడి, ముగ్గుర్నీ మందారచెట్లయి పొమ్మని శపించాడు. వాళ్ళే ఈ మందారచెట్లు. రాజుకు ఈ సంగతి తెలిసింది. ఆయన యోగి కాళ్ళ మీద పడి, అజ్ఞానం చేత అపచారం చేసిన తన పిల్లలను క్షమించమనీ, వాళ్ళ శాపాన్ని ఉపసంహరించమనీ వేడుకున్నాడు. యోగి కాస్త సామ్యుడై, 'వాళ్ళు నన్నడిగిన ప్రశ్నలకు ఎవడు సమాధానం ఇచ్చినా వాళ్ళ శాపం తీరిపోతుంది. సమాధానం ఇస్తానని మాట ఇచ్చి, ఆ పని చెయ్యలేనివాడు ఎండుచెట్టు అయిపోతాడు,' అని వెళ్ళిపోయాడు. అలా అయిపోయినవాళ్ళే ఆ కనిపించే ఎండుచెట్లు. ఇది జరిగాక రాజు రాజ్యం మీద విరక్తి చెంది, రాజ్యభారాన్ని తన మంత్రులకు వదిలి, వాళ్ళకు మరొక రాజధాని ఏర్పాటు చేశాడు. తన కుమార్తెలను మనుషులుగా చేసినవాళ్ళకు తన కూతుళ్ళ నిచ్చి పెళ్ళిచేస్తానని కూడా రాజు చాటింపు వేయించాడు. ఆ ఆశకొద్దీ ఒకరిద్దరు వచ్చి చెట్లయిపోయారు. నిన్న కూడా ఒక రాజకుమారుడు వచ్చి, ప్రయత్నించి విఫలుడై, చెట్టుగా మారిపోయాడు. అదే ఈ చెట్టు."

పశుపతికి రెండు విషయాలు అర్థమయాయి. ఈ వృద్ధుడే ఆ రాజు. నిన్న వచ్చి చెట్టయిపోయినవాడు తన అన్న నాగవాహనుడు.

పశుపతి ఆ వృద్ధుడితో, "ఏమయినా సరే, నేనూ ప్రయత్నిస్తాను," అని, చెరువు వద్దకు వచ్చి, హంసను స్మరించాడు. వెంటనే హంస వచ్చింది. చెరువు అడుగున ఉన్న తాళపుచెవి కావాలని పశుపతి

హంసను కోరాడు. హంస నీట అడుగు నుంచి తాళంచెవి తెచ్చి పశుపతి కిచ్చింది. వృద్ధుడు పెట్టె తెచ్చి ఇచ్చాడు. పశుపతి పెట్టె తెరిచి, లోపలి నుంచి ఒక తాళపత్రం తీశాడు. దానిపైన, "మెరిసేదంతా బంగారం కాదు," అని రాసి ఉన్నది.

తరవాత పశుపతి చీమను తలుచుకున్నాడు. చీమ వచ్చింది.

"నేల మీద ముత్యాలు పడి ఉన్నాయి. వాటన్నిటినీ వెతికి, ఏరి, నా కివ్వాలి," అన్నాడు పశుపతి. వెంటనే చీమలదండు వచ్చి, ముత్యాల'న్నిటినీ తెచ్చి ఇవ్వగా, పశుపతి వాటిని ఎంచి చెప్పాడు.

ఇక మందారచెట్ల రూపంలో ఉన్న రాజకుమార్తెలలో చిన్నది ఎవరో తెలుసుకోవాలి. పశుపతి తేనెటీగను స్మరించాడు. తేనెటీగ వచ్చింది. "ఈ రెండు మందార చెట్లలో చిన్న దానిపైన వాలు!" అన్నాడు పశుపతి. తేనెటీగ ఒక చెట్టుపై వాలింది.

మరుక్షణమే, ఇంద్రజాలంలాగా, మూడు మందార చెట్లూ, ఎండిన చెట్లూ మనుష్య రూపాలు ధరించారు. మనుషులైన ఎండు చెట్లలో నాగవాహనుడు కూడా ఉన్నాడు.

వృద్ధుడు తన కుమార్తెలనూ, కుమారుణ్ణీ కౌగలించుకుని ఆనందబాష్పాలు రాల్చాడు. ఆయన తన కుమార్తెలతో, "నేను వాగ్దానం చేసిన ప్రకారం మీ రిద్దరూ ఈ యువకుణ్ణి పెళ్ళాడండి," అన్నాడు.

దానికి పశుపతి, "నాకు చిన్న దాన్ని ఇచ్చి పెళ్ళి చెయ్యండి. మీ పెద్ద కుమార్తెను నా అన్న కిచ్చి చెయ్యండి. ఇతను నా అన్న!" అని నాగవాహనుణ్ణి రాజుకు పరిచయం చేశాడు.

వృద్ధరాజు సంతోషించి, తన కుమార్తెలిద్దరినీ రాజకుమారుల కిచ్చి పెళ్ళి చేశాడు. నాగవాహనుడూ, పశుపతీ దేశాటన ముగించి, తమ భార్యలతో సహా స్వదేశానికి తిరిగి వెళ్ళిపోయారు.





# ఓటమీ — గెలుపూ

ఒక గ్రామంలో ఒక రైతుకు ఇద్దరు కొడుకులుండేవారు. ఆ గ్రామం బస్తీకి చాలా దూరాన ఉండేది. ఒక కొండను చుట్టి, అడవి మార్గంగా వెళ్ళాలి. అందుచేత రైతు బస్తీ నుంచి తనకు కావలిసిన సరుకులు మూడు నాలుగు నెలల కొకసారి తెచ్చుకునేవాడు. సాధారణంగా ఈ పని రైతు కొడుకులు చేస్తూ ఉండేవాళ్ళు.

ఒకసారి ఇలాగే బస్తీ నుంచి సామాన్లు తేవలిసి వచ్చింది. రైతు తన కొడుకులకు అయిదువందల రూపాయిలిచ్చి బస్తీకి పంపుతూ, "అడివి దారిన కొత్తగా దొంగతనాలు ఆరంభమయినట్టు చెప్పుకుంటున్నారు. అందుచేత కాస్త జాగ్రత్తగా వెళ్ళిరండి. గట్టి కర్రలు చేతిలో విడవకుండా ఉంచుకోండి. చీకటి పడకుండా తిరిగి రండి. ఇద్దరూ అడివి మార్గంలో ఒకరి కొకరు ఏ మాత్రమూ దూరం కావద్దు. విన్నారు గదా? సరే, ఇక వెళ్ళిరండి," అని హెచ్చరించాడు.

"దొంగలు మనని ఏం చేస్తారులే? వస్తే బుర్ర పగలగొట్టేస్తాం గాని, వదుల్తామా?" అని తండ్రితో బింకాలాడి, రైతు కొడుకులు బస్తీకి బయలుదేరారు. వారి ధైర్యానికి సగం కారణం దొంగలను గురించిన వార్తలు రూఢి కాకపోవటమే.

కాని వాళ్ళిద్దరూ కొండ మలుపులో ఉన్న అరణ్యంలో నుంచి పోతూ ఉండగా, నలుగురు దొంగలు చెట్ల చాటు నుంచి వారి ముందుకూ, వెనక్కూ వచ్చి చుట్టు ముట్టి, "మీ దగ్గర ఉన్నదంతా ఇచ్చి పారిపొండి. లేకపోతే బుర్రలు బద్దలవుతాయి!" అని గర్జించారు.

వాళ్ళు ముసుగులు వేసుకుని రాక్షసుల్లాగా ఉన్నారు. వాళ్ళ గొంతులు ఉరుముల్లాగున్నాయి. రైతు కొడుకులు చలి

ఎల్. సుదర్శనం



జ్వరం వచ్చినట్టుగా వణికారు. వాళ్ల దగ్గర ఉన్న రూపాయల సంచీ కింద పడింది.

"ఇక పారిపొండి!" అంటూ దొంగలు తమ లాఠీ లెత్తి మీదికి వచ్చేసరికి, ఇద్దరూ వెనక్కు తిరిగి, కాలి సత్తువకొద్దీ పారి పోయి, ఇంటికి చేరుకున్నారు.

వాళ్ళు జరిగిన సంగతి తండ్రికి చెప్పి, "దొంగలంటే ఏమో అనుకున్నాం. వాళ్లెంత భయంకరంగా ఉన్నారని! వాళ్ల గొంతులు! వాళ్ళ కళ్ళు! వాళ్ళ లాఠీలు! బతికుంటే బలుసాకు తినవచ్చునని, వాళ్ళకు దొరక్కుండా ప్రాణాలు దక్కించుకుని పారిపోయి వచ్చాం!" అన్నారు.



రైతు వాళ్ళ మాటలు విని క్రోధంతో వణికిపోతూ, "దౌర్భాగ్యులారా! పిరికి వెధవల్లారా! ఒక్కొక్కళ్ళు ఇద్దరేసి తిండి తింటారు మళ్ళా! దొంగలను ఎదిరించలేక పోయారా? వాళ్ళ లాఠీలు మీ లాఠీలకన్న గట్టివని మీకు ఎలా తెలిసిందిరా? నా గొంతు కన్న వాళ్ళ గొంతు భయంకరమా? నా కళ్ల కన్న వాళ్ళ కళ్ళు నిప్పుల్లాగున్నాయా? దొంగలు కంట బడగానే పులులల్లే మీద పడి చావ గొట్టక, ప్రాణాలు దక్కించుకు వచ్చామని సంతోషిస్తున్నారా? ఛీ, మీ పిరికి మొహాలు చూస్తేనే పాపం చుట్టుకుంటుంది. దొంగలు లాక్కున్నది తిరిగి లాక్కోకుండా నా ఎదట పడకండి. ఊఁ, పొండి!" అని రంకెలు పెట్టాడు.

అన్నదమ్ములిద్దరూ తలలు వంచుకుని బయటికి నడిచారు. ఇప్పుడు వాళ్ళకు దొంగలను చూసి భయపడటం సిగ్గు చేటుగానే కనబడింది. దాని మీద తండ్రి చేత అలాటి మాటలు పడటం రెట్టింపు అవమానం అయింది. వాళ్ళకు పౌరుషం వచ్చింది.

"ఛీ, వెధవ పని చేశాం. దొంగా మనిషేనన్న మాట కూడా మరిచిపోయాం. దొంగలను జయించి గాని మనం ఇంటికి తిరిగి పోవద్దు," అని వాళ్ళు తీర్మానించుకున్నారు.





కాని దొంగలను జయించే మార్గమేది? ముల్లును ముల్లుతోనే తీయాలి. తాము కూడా దొంగలు కావటమే సరయిన మార్గమని వాళ్ళు నిశ్చయించుకున్నారు. అందుకోసం ఇద్దరూ గడ్డాలూ, మీసాలూ పెంచుకున్నారు. ముఖానికి మసి పూసుకుని భయంకరంగా తయారయారు. చెరొక దుడ్డు కర్రా, కత్తీ, తాడూ తీసుకుని అడవి దారిలో పొంచి నిలిచారు.



కొంత సేపయాక ఒక దొంగలాటి వాడు అటుగా వచ్చి, ఒక చెట్టు మాటున చేరటం వాళ్ళ కంట పడింది. అన్నదమ్ములిద్దరూ కూడబలుక్కుని, వాడు దాగి ఉన్న చెట్టు దగ్గిరికి వెళ్ళి, రెండు పక్కల నుంచీ వాడి మీద పడి, దుడ్డు కర్ర లెత్తి, "నీ దగ్గిర ఉన్నదంతా అక్కడ పెట్టు. లేకపోతే చంపేస్తాం!" అని భీకరంగా అరిచారు.

వాడు నిర్ఘాంతపోయి, "ఎవరు మీరు? దొంగలా? నే నెవరి ననుకున్నారు? నేనూ దొంగనే! మా ముఠాకు నేనే నాయకుణ్ణి. మీరు కొత్త వాళ్ళు లాగున్నారే? ఇక్కడ మిమ్మల్ని ఇంతకు ముందు చూడలేదు. కొత్తగా వచ్చిన వాళ్ళయితే మనమూ మనమూ కలిసి పని చేద్దాం. మాతోపాటు వంతు పుచ్చుకుందురు గాని!" అన్నాడు.

"మేము పొరుగూరు వాళ్ళం. మీతో కలిస్తే మాకేం లాభం? మీ రెందరు? ఏపాటి సంపాదించారు?" అని అన్నదమ్ములు దొంగలనాయకుణ్ణి అడిగారు.

"ఈ చోటు అచ్చిరాలేదు. ఎనిమిది రోజుల్లో రెండు దోపిడీలే చేశాం. ఇంతకన్న అచ్చుబాటుగా ఉండే చోటికి పోదాం. మేం ఆరుగురం. మీరు కూడా చేరితే, ఒక్కొక్కరికీ ఎనిమిదోవంతు వస్తుంది. ఏమంటారు?" అన్నాడు దొంగలనాయకుడు.

"మీ ఆరుగురూ మమ్మల్ని మోసం చేస్తే? ముందుగా బయానా ఇయ్యి. నీ మాట నమ్ముతాం," అన్నారు అన్నదమ్ములు.



"అయితే కిందటిసారి ఇద్దరు కుర్రాళ్ళ దగ్గిర దోచిన అయిదువందల రూపాయలున్నాయి. వాటిని ఇద్దరూ ప్రస్తుతానికి తీసుకోండి," అన్నాడు దొంగలనాయకుడు.

"ఇంతేనా? సరే, అదే ఇయ్యి. పెద్ద మొత్తాల దోపిడీలు మేం చేసి చూపిస్తాంలే," అంటూ అన్నదమ్ములు దొంగ వెంట వాళ్ళ రహస్యస్థలానికి వెళ్ళారు.

అక్కడ ఉన్న తన అనుచరులకు దొంగలనాయకుడు కొత్తదొంగలను పరిచయం చేశాడు. తరవాత అన్నదమ్ములు తాము పోగొట్టుకున్న అయిదువందలూ దొంగలనాయకుడి నుంచి తీసుకుని, "మా రహస్యస్థలం కూడా చూపిస్తాం, రా!" అని వాణ్ణి ఆహ్వానించారు.

కొత్తదొంగల రసహస్యస్థలం చూడటానికి మిగిలిన దొంగలు కూడా రాబోతుంటే, అన్నదమ్ములు వాళ్ళతో, "మనమంతా త్వరలో కొత్తచోటికి పోబోతున్నాం కద. మేం దాచినదంతా ఇక్కడికే తెస్తాం. మన నాయకుణ్ణి మా వెంట రానివ్వండి," అని చెప్పారు.

"ఇప్పుడే వచ్చేస్తాం. మీ రెక్కడికీ వెళ్ళకండి," అని దొంగలను వాళ్ళ నాయకుడు హెచ్చరించి, అన్నదమ్ముల వెంట బయలుదేరాడు.

ముగ్గురూ కలిసి అడవి వెంట కొంత దూరం వెళ్ళాక అన్నదమ్ములు దొంగల నాయకుడి పైన అకస్మాత్తుగా పడి, నిరాయుధుణ్ణి చేసి, పెడరెక్కలు విరిచికట్టి, నోట గుడ్డలు కుక్కి తమ ఊరికి ఈడ్చుకుపోయి, రాజభటులకు అప్పగించారు.

రాజభటులు వాళ్ళ సహాయంతోనే దొంగల రహస్యస్థలం తెలుసుకుని, మిగిలిన దొంగలను కూడా పట్టుకున్నారు.

తన కొడుకుల ప్రజ్ఞకు రైతు తృప్తిపడ్డాడు. రాజుగారు వాళ్ళకు తగిన బహుమానం కూడా ఇచ్చాడు.





# జ్యోతిష్కుడి పొరబాటు

మంగళాపురం రాజుగారికి లేకలేక కొడుకు పుట్టాడు. ఆస్థాన జ్యోతిష్కుడు విష్ణుశర్మ సుప్రసిద్ధ జ్యోతిష్కుడు. రాజుగారికి ఫలాని సమయంలో సంతానం కలుగుతుందని ఆయన ముందుగానే చెప్పాడు.

రాజు భార్య ప్రసవమైన క్షణంలోనే విష్ణుశర్మ భార్య కూడా ఒక మగశిశువును ప్రసవించింది. రాజుకొడుకు జాతకంలోనూ, విష్ణుశర్మ కొడుకు జాతకంలోనూ అవంత తేడా కూడా లేదు.

విష్ణుశర్మ రాజకుమారుడి జాతకచక్రం వేసి, రాజుగారికి ఫలితం చెప్పాడు. రాజు కొడుకు దీర్ఘాయువు. ఆరోగ్యంగా బతికి, బహుకాలం సుఖంగా రాజ్యం ఏలుతాడు.

"మీకు కూడా ఆ రోజునే పిల్లవాడు కలిగాడట కదా? వాడి జాతకం ఎలా ఉన్నది?" అని రాజు విష్ణుశర్మను అడిగాడు.

"వాడి జాతకం కూడా మంచిదే. చెడు ఏమీ లేదు," అన్నాడు విష్ణుశర్మ.

అసలు సంగతేమిటంటే, విష్ణుశర్మ కొడుకు జాతకంలో కూడా రాజయోగం ఉన్నది. వాడు కూడా రాజకుమారుడి లగ్నంలోనే పుట్టాడు. తన కొడుక్కూ రాజయోగం ఉన్నదన్నట్టయితే రాజు కీడు చేస్తాడేమోనని విష్ణుశర్మ ఆ మాటఎత్తలేదు.

రోజులు గడిచాయి. రాజు కొడుకూ, విష్ణుశర్మ కొడుకూ పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. కాని విష్ణుశర్మ కొడుకు తండ్రి అనుకున్నట్టుగా తయారు కాలేదు. వాడికి పెద్దలంటే లక్ష్యం లేదు. పరమ కిరాతకుడుగా తయారయాడు. రాజు కొడుకుకు యువరాజ పట్టాభిషేకం జరిగే నాటికి విష్ణుశర్మ కొడుకు తల్లిదండ్రులతో పోట్లాడి, ఇంట్లో ఉన్న డబ్బంతా తీసుకుని ఎటో వెళ్ళిపోయాడు.

టి. పుండరీకాక్షయ్య

తన కొడుకు జీవితం ఇలా ఎందుకు పరిణమించినదీ విష్ణుశర్మకు అంతుబట్ట లేదు. ఆయన అంచనాలన్నీ తలకిందులై పోయాయి. ఆయనకు జ్యోతిషంలో విశ్వాసం పోయింది. ఒకనాటి రాత్రి ఆయన తన వద్ద నున్న జ్యోతిష గ్రంథాలన్నిటినీ తీసుకుని, వాటిని తగలబెట్టే ఉద్దేశంతో ఊరిబయటికి వెళ్ళాడు.

ఒక నిర్జన ప్రదేశంలో విష్ణుశర్మ జ్యోతిష గ్రంథాలను దగ్ధం చేయబోతూండగా ఒక పండుముసలి ఆయనను సమీపించి, "ఏం చేస్తున్నావు? ఏదో ఘోరమైన పనిని తెలిసి చేస్తున్నవాడిలాగుందే?" అన్నాడు.

విష్ణుశర్మ ఆయనతో తన కొడుకు గురించి వివరంగా చెప్పాడు.

"జ్యోతిషశాస్త్రంలో పండితుడివి గదా! నీ కొడుక్కు రాజయోగం ఇవ్వగల గ్రహం ఇప్పు డెక్కడ ఉన్నదో చెప్పు," అని ముసలివాడు అడిగాడు.

విష్ణుశర్మ కొంచెం ఆలోచించి, "మంగళ గ్రహం! నా ఇంటి నుంచి వెళ్ళిపోయింది," అని జవాబిచ్చాడు.

"మరి ఇకనేం? నీ కొడుకు జాతకం నువ్వనుకున్నట్టే జరుగుతుంది. నీ కొడుకు నీవు వూహించుకున్నట్టే నీకు విధేయుడై, మేధకుడై పెరిగితే రాజు ఎలా కాగలడు? నీ ఇంటనే ఉంటే వాడికి రాజయోగం పట్టునా? ఇంతకూ, రాజపిత అయే యోగం నీకున్నాదా?" అని ముసలివాడు విష్ణు శర్మను అడిగాడు.

ఆ ముసలివాడు మంగళుడే నని విష్ణు శర్మకు అర్థమయింది. "నన్ను క్షమించు, మంగళదేవా!" అని ఆయన ముసలివాడి ముందు సాష్టాంగపడ్డాడు.

విష్ణుశర్మ తల ఎత్తి చూసేసరికి ముసలి వాడి జాడ లేదు. ఆయన తన గ్రంథాలన్నీ ఇంటికి తీసుకుపోయి, తిరిగి గ్రహపూజ కొన సాగిస్తూ తన జీవితం గడిపాడు.





# కృష్ణావతారం

శిశుపాలుడికి సాల్వుడనే స్నేహితుడున్నాడు. రుక్మిణిని కృష్ణుడు ఎత్తుకుపోయే సందర్భంలో మిగిలినవాళ్ళతోబాటు ఈ సాల్వుడు కూడా ఓడిపోయాడు. అందుకని అతడికి పౌరుషం వచ్చి, లోకంలో యాదవులు లేకుండా చేస్తానని ప్రతిజ్ఞపట్టి, కేవలమూ మట్టి మాత్రమే తింటూ శివుణ్ణి గురించి దారుణమైన తపస్సు చేసి ప్రత్యక్షం చేసుకుని, తనకు ఎదురులేని విమానం ఒకటి కావాలని కోరాడు. శివుడు చెప్పగా, విశ్వకర్మ నల్లని ఇనుప విమానం ఒకటి తయారు చేసి సాల్వుడి కిచ్చాడు. సౌభమనే ఆ విమానం ఎక్కి సాల్వుడు ద్వారక పైకి దాడి వెళ్ళాడు. అతని సేనలు కూడా వచ్చి నగరాన్ని ముట్టడించాయి.

సాల్వుడు విమానం నుంచి రాళ్ళూ, చెట్లూ, ఆయుధాలూ నగరం మీద వేసి భీభత్సం చేశాడు. అతని సేనలు నగరపు ప్రాకారాలనూ, ద్వారాలనూ, తోటలనూ ధ్వంసం చెయ్యసాగాయి. అది చూసి ప్రద్యుమ్నుడు నాయకత్వం వహించి, సాత్యకీ, చారుదేష్ణుడూ, సాంబుడూ, అక్రూరుడూ, కృతవర్మా మొదలైన యోధులనూ, సైన్యాన్నీ వెంటబెట్టుకుని సాల్వుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు. అప్పటికి కృష్ణుడింకా పాండవుల వద్దనే ఉన్నాడు.

సాల్వుడి పక్షానికీ, యాదవుల పక్షానికీ మధ్య ఇరవై ఏడు రోజులపాటు తీవ్రంగా యుద్ధం జరిగింది. అప్పటికి కృష్ణుడు ద్వారకకు తిరిగివస్తూ యుద్ధ పరిస్థితి

## 29. కుచేలుడి కథ



గ్రహించి, తన రథాన్ని తిన్నగా సాల్వుడి పైకి తోలించాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. కృష్ణుడు సౌభవిమానాన్ని భగ్నం చేసి, సముద్రంలో పడేటట్టు చేసి, సాల్వుణ్ణి చక్రాయుధంతో చంపేశాడు.

సాల్వుడు చావగానే అతని స్నేహితుడైన దంతవక్త్రుడు గద ఒకటి తీసుకుని, ఒంటరిగా కృష్ణుడితో యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడు దంతవక్త్రుడికి మేనమామ కొడుకే. అతను కూడా ఒక గద తీసుకుని దంతవక్త్రుడితో యుద్ధం చేస్తూ, రొమ్ము పగలగొట్టి అతన్ని చంపేశాడు. సాల్వుడు ప్రారంభించిన యుద్ధం తుదముట్టింది...



కృష్ణుడికి కుచేలుడనే బాల్య స్నేహితుడొకడుండేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిరే చదువుకున్నారు. కుచేలుడు పెళ్ళాడి, గృహస్థాశ్రమం గడుపుతున్నాడు, కాని కటిక దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. దారిద్ర్య బాధ కుచేలుడికి కన్న అతని భార్యకు దుస్సహంగా ఉన్నది. అందుచేత ఆమె ఒకసారి తన భర్తతో, "కృష్ణుడు నీకు స్నేహితుడే గదా? అతను బ్రాహ్మణులకు ఎడతెగని దానా లిస్తాడట. శరణువేడిన వారిని తప్పక ఆదుకుంటాడట. అలాటప్పుడు, స్నేహితుడివీ, సంసారభారం మోస్తున్నవాడివీ అయిన నీకు సహాయం చెయ్యడా?" అన్నది.

కుచేలుడికి కూడా, సహాయం కోరే వంకన కృష్ణుణ్ణి చూడాలనిపించింది. చూడటంవల్ల లాభం ఉంటుందని కూడా అతనికి తెలుసు. కనక అతను భార్యతో, "కృష్ణుణ్ణి చూడబోతాను. కాని వట్టి చేతులతో కాకుండా అతనికి కానుక ఏదైనా తీసుకుపోతే బాగుంటుంది. అందుకు తగినదేమన్నా ఇంట్లో ఉన్నదా?" అని అన్నాడు.

కుచేలుడి భార్య ఇరుగు పొరుగు ఇళ్ళవారి నుంచి నాలుగు గుప్పిళ్ళు అటుకులు ముష్టిఎత్తి తెచ్చి, వాటిని చిన్న గుడ్డలో





మూట కట్టి, భర్త కిచ్చింది. కుచేలుడు ఆ అటుకుల మూట చేత బట్టుకుని ప్రయాణమై, ద్వారకకు చేరుకుని, కృష్ణుడి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు.

మంచం మీద పడుకుని ఉన్న కృష్ణుడు కుచేలుణ్ణి చూడగానే లేచి ఎదురు వచ్చి, గట్టిగా కౌగలించుకుని, తీసుకు వచ్చి తన మంచం మీద కూర్చోబెట్టి, తానే స్వయంగా కుచేలుడి కాళ్ళు కడిగి, ఆ నీరు నెత్తిన చల్లుకుని, కుచేలుడి శరీరానికి గంధం రాచి, పూలమాలవేసి, దేవుణ్ణి చూసినట్టు చూశాడు. ఒళ్ళంతా మట్టి కొట్టుకుని, చింకి బట్టలు ధరించి, శవాకారంలో ఉన్న ఆ బ్రాహ్మడికి తన భర్త అంత ఆదరం చూపటం గమనించి, రుక్మిణి వింజామర తీసుకుని కుచేలుడికి విసర నారంభించింది. కృష్ణుడు కుచేలుడి పట్ల చూపిన అభిమానానికి అక్కడ ఉన్న వారంతా ఆశ్చర్యపోయారు.

కృష్ణుడు కుచేలుడికి చెయ్యదగిన మర్యాదలన్నీ చేసి, గురుకులంలో చదిలిన రోజులనాటి తమ అనుభవాలు నెమరువేయ నారంభించాడు.

ఒకసారి గురుపత్ని వాళ్ళను సమిధలు తెమ్మని పంపింది. వాళ్ళు ఒక మహా



రణ్యంలో ప్రవేశించారు. ఇంతలో ఒక పెద్ద గాలివాన ఆరంభమయింది. ఆకాశాన మెరుపులు మెరిశాయి. పిడుగులు పడ్డాయి. ఇలా మెరుపులూ, ఉరుములూ సాగుతూండగానే సూర్యాస్తమానమై పోయింది. సమిధల కోసం వచ్చినవాళ్ళు తడిసి ముద్ద అయిపోయారు. దారి తెలీదు. మిట్టపల్లా లేకమైపోయాయి. ఒకళ్ళ చేతులొకళ్ళు పట్టుకుని అరణ్యంలో తెల్లవార్లూ తిరగాడారు. మర్నాడు తెల్లవారింది. శిష్యులు అడవిలో చిక్కుపడి పోయారని తెలిసి సాందీపని గురువు వాళ్ళను వెతుక్కుంటూ వచ్చి, దైన్యస్థితిలో ఉన్న కుర్రవాళ్ళను చూసి,





కుచేలుడు కంగారు పడ్డాడు. కృష్ణుడికి తాను తెచ్చిన అటుకు లివ్వాలంటే అతనికి చాలా సిగ్గు వేసింది. కృష్ణుడే బలవంతంగా కుచేలుడి చేతిలో ఉన్న గుడ్డపేలిక మూట తీసుకుని, "ఇందులోది ఏమిటి?" అని అడుగుతూ విప్పి, "అటుకులే? నా కెంత ఇష్టమనుకున్నావు!" అంటూ పిడికెడు నోట వేసుకుని, మరో పిడికెడు చేతిలోకి తీసుకున్నాడు.

"ఆ తిన్నవి చాలు!" అంటూ రుక్మిణి కృష్ణుడి చెయ్యిపట్టుకున్నది.

ఆ రాత్రి కుచేలుడు కృష్ణుడి ఇంటనే స్నానమూ, భోజనమూ, నిద్రా సుఖంగా చేసి, తాను నిజంగా స్వర్గంలోనే ఉన్నాననుకున్నాడు.

మర్నాడు కుచేలుడు తన ఇంటికి ప్రయాణమయేటప్పుడు కృష్ణుడు అతన్ని కొంతదూరం సాగనంపాడు. తనకు కృష్ణుడు ధనమేమీ ఇవ్వలేదు. అతను తన మనసులో, "కృష్ణుడు మహారాజు. నేనో హీనుడైన నిరుపేద బ్రాహ్మణ్ణి. బ్రాహ్మణ్ణి కదా అన్న ఆదరంతో నన్ను అతను కౌగలించుకున్నాడు. తన తమ్ముణ్ణి చూసినట్టు చూశాడు. తన భార్య పడుకునే మంచం మీద కూర్చోబెట్టాడు. తన భార్యచేత వింజా

"మా కోసం ఎంత ప్రయాసపడ్డారు! ఇంత కన్న ఉత్తమ శిష్యులు గురువుకు ఏం చెయ్యగలరు? మీ భక్తికి సంతోషించాను. మీ కోరికలు ఈడేరుతాయి," అని ఆశీర్వదించాడు. ఈ సంఘటనను కృష్ణుడు కుచేలుడికి జ్ఞాపకం చేసి, "గుర్తు ఉన్నదా?" అని అడిగాడు.

"నీతో గురుకులవాసస్నేహం చేసిన నా బోటి వాడికి ఏ కోరిక తీరదు?" అన్నాడు కుచేలుడు.

కృష్ణుడా మాటకు నవ్వి, "ఇంతకూ మీ ఇంటి నుంచి నాకేం తెచ్చావు?" అని అడిగాడు.





మర వీయించాడు.' దేవుడికి చెయ్యదగి నంత మర్యాద చేశాడు. నాకు డబ్బిచ్చి నట్టయితే నాకు కళ్ళు నెత్తికొచ్చి తనను మరిచిపోతాననుకుని కాబోలు ఆ పని చెయ్యలేదు," అనుకున్నాడు.

కాని కుచేలుడు తన ఇంటి కేసి వెళ్ళే సరికి, ఎట్టెదట కళ్ళు జిగేలుమనే రాజ భవనాలు కనిపించాయి. ఉద్యానవనాలూ, సరోవరాలూ కనిపించాయి. వాటిలో రక రకాల పక్షులూ, తామరలూ, కలువలూ కనిపించాయి. భవనంలో దాస దాసీలు తిరుగాడుతున్నారు.

"ఇది ఎవరి ఇల్లయి ఉంటుందీ? నా యిల్లు కాదే! ఇదంతా ఇక్కడ ఎలా వచ్చిందీ?" అని కుచేలుడు దిగ్భ్రమ చెంది ఉండగా, దేవతలా అన్నట్టున్న స్త్రీ పురుషులు మేళతాళాలతో అతనికి ఎదురు వచ్చి, భవనంలోకి అతన్ని తీసుకుపోయారు.

మారువేషంలో ఉన్న లక్ష్మీదేవి లాగా కుచేలుడి భార్య వచ్చి తన భర్తను చూసి, కన్నీరు తోసుకు వచ్చే కళ్ళను గట్టిగా మూసుకుని భర్తకు నమస్కరించి, మనసు లోనే అతన్ని ఆలింగనం చేసుకున్నది.

ఇదంతా చూసి కుచేలుడు తనలో, "నాకీ ఐశ్వర్యమంతా కృష్ణుణ్ణి చూసి రావటం చేతనే కలిగి ఉంటుంది. మరో కారణమేదీ కనబడదు. స్నేహితుడంటే అలాగే ఉంటాడు; తాను పుచ్చుకున్నది కొంచెమే అయినా దాన్ని చాలా ఘనంగా భావిస్తాడు; తాను ఇచ్చేది ఎంతో గొప్పదే అయినా దాన్ని అల్పంగానే భావిస్తాడు," అనుకున్నాడు.

అటు తరవాత సకలైశ్వర్యాలతో కుచేలుడు తన భార్యతోనూ, బిడ్డలతోనూ సుఖంగా జీవించాడు.

ఒకప్పుడు సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. అప్పుడు యాదవులందరూ, అని రుద్ధుణ్ణి ద్వారకకు రక్షకుడుగా ఉంచి,



కురుక్షేత్రానికి బయలుదేరి వెళ్ళారు. అక్కడ కృష్ణుడికి పాత చుట్టాలంతా కలిశారు. నందుడూ, యశోదా వచ్చారు. కుంతి వచ్చింది. భీష్మద్రోణులూ, ధృతరాష్ట్రుడూ, సంజయుడూ, విదురుడూ, కృపుడూ, దుర్యోధనుడు మొదలైనవారూ, గాంధారీ, పాండవులూ, వారి భార్యలూ, అందరూ చాలా కాలానికి ఒక చోట సమావేశమయారు. అందరూ కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో పాండవుల భార్య అయిన ద్రౌపది కృష్ణుడి అష్టభార్యలను, "మీకూ కృష్ణుడికీ ఎలా వివాహాలు జరిగాయి?" అని అడిగింది.



"నన్ను శిశుపాలుడి 'కివ్వాలని జరాసంధుడు మొదలైన వారంతా నిర్ణయిస్తే, కృష్ణుడు వచ్చి, అందరినీ మట్టి కరిపించి, నన్ను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకున్నాడు," అని రుక్మిణి తన వివాహ వృత్తాంతం చెప్పింది.

"నన్ను మా తండ్రి సత్రాజిత్తు మరెవరికో ఇద్దామనుకున్నాడు. అంతలో నా పినతండ్రి చనిపోయాడు. అది కృష్ణుడి పనే నని మా తండ్రి ఒక అపవాదు వేశాడు. అప్పుడు కృష్ణుడు బయలుదేరి వెళ్ళి, మా పినతండ్రిని చంపిన సింహాన్ని చంపి శ్యమంతకమణిని తీసుకుపోయిన జాంబవంతుణ్ణి జయించి, మణిని తెచ్చి మా తండ్రికిచ్చి, నన్ను పెళ్ళాడాడు," అన్నది సత్యభామ.

"మా తండ్రి జాంబవంతుడు ఇరవై అయిదు రోజులు కృష్ణుడితో పోరిన మీదట, ఆ నాటి రాముడే ఈ కృష్ణుడుగా అవతరించాడని గ్రహించి, ఆయన కాళ్ళు పట్టుకుని, సింహాన్ని చంపి తెచ్చిన శ్యమంతకమణితోపాటు నన్ను కూడా కృష్ణుడికి అర్పించాడు," అన్నది జాంబవతి.

"నేను తన కోసం తపస్సు చేశానని తెలిసి, అర్జునుణ్ణి వెంట పెట్టుకుని నా దగ్గి

రికి వచ్చిన కృష్ణుడు నన్ను పెళ్ళాడాడు," అని కాళింది చెప్పింది.

"నాకు స్వయంవరం ఏర్పాటయినప్పుడు అనేకమంది రాజులు వచ్చారు. కృష్ణుడు ఆ రాజులందరినీ, జయించి నన్ను పెళ్ళాడాడు," అని భద్ర చెప్పింది.

"మా తండ్రి ఏడు ఆబోతులను ఎవరు గెలిస్తే వారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. కృష్ణుడు వాటిని మేకపిల్లలనులాగా అవలీలగా నిగ్రహించి, నన్ను పెళ్ళాడాడు," అని నీళ చెప్పింది.

"నాకు కృష్ణుడు మేనమామ కొడుకే. నాకు అతన్నే పెళ్ళాడాలని ఉన్నదని తెలిసి మా తండ్రి నన్నతనికిచ్చి పెళ్ళి చేశాడు," అన్నది మిత్రవింద.

చివరకు లక్షణ తన వివాహ వృత్తాంతాన్ని ఇలా చెప్పింది:

"మీ తండ్రిలాగే మా తండ్రి బృహత్సేనుడు కూడా ఒక మత్స్యయంత్రం ఏర్పాటు చేసి దాన్ని కొట్టినవారికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానని ప్రకటించాడు. నీ తండ్రి ఏర్పాటు చేసిన మత్స్యయంత్రం బయటికి కనిపించక పోయినా, లోపలికి కనిపించింది. కాని మా తండ్రి ఏర్పాటు చేసినది బయటా, లోపలా కూడా కనిపించక, నీటిలో దాని ప్రతిబింబం మాత్రమే, అది కూడా అస్పష్టంగా, కనిపించింది. దాన్ని కొట్టటానికి మా తండ్రి ఏర్పాటు చేసిన బాణాన్ని చాలామంది ఎక్కుపెట్టలేకనే పోయారు. జరాసంధుడూ, శిశుపాలుడూ, భీముడూ, దుర్యోధనుడూ, కర్ణుడూ విల్లు ఎక్కుపెట్టి కూడా నీటిలో ప్రతిబింబాన్ని కనిపెట్టలేక పోయారు. అర్జునుడు ప్రతిబింబాన్ని కనిపెట్టి కూడా కొట్టలేకపోయాడు. అప్పుడు కృష్ణుడు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి, మత్స్యయంత్రాన్ని కొట్టి, నన్ను పెళ్ళాడాడు."

ద్రౌపదితో బాటు ఈ కథలన్నీ విన్న స్త్రీలందరూ ఎంతో ఆనందించారు.





# అరణ్యపురాణం

## 32

మౌగ్లీ తాను అరణ్యంలో లేడన్నమాట పూర్తిగా మరిచిపోయి, ఎదురుగా కనిపించే దీపంకాంతి కేసి నిశ్చింతగా నడిచాడు. మూడు, నాలుగు కుక్కలు ఒక్కసారిగా మొరగ నారంభించాయి.

మౌగ్లీ చప్పున కూర్చుని, తోడేలు లాగా చిన్నగా గుర్రు పెట్టాడు. దానితో కుక్కలు మొరగటం మానాయి.

"నే నీ మనిషి మంద ప్రాంతాలకు అసలు దేనికి వచ్చినట్టు?" అనుకున్నాడు, అతను మూతి నిమురుకుంటూ. కిందటిసారి మనిషిమంద రాళ్ళు విసిరి నప్పుడు ఒక రాయి ఆ మూతికే తగిలింది.

గుడిసె తలుపు తెరిచి, ఒక స్త్రీ ద్వారం వద్ద నిలబడింది. లోపల బిడ్డ ఏడుస్తున్నాడు. ఆ స్త్రీ వెనుదిరిగి, "పడుకోరా. ఏ నక్కనో చూసి కుక్కలు మొరిగాయిలే!" అన్నది.

గడ్డిలో దాగి ఉన్న మౌగ్లీ చలిజ్వరంతో వణికినట్టు వణికాడు. ఆ గొంతు అతనికి బాగా పరిచితమైనది. ఆ సంగతి నిర్ధారణ చేసుకోవాలి. అప్రయత్నంగా అతని నోట మనిషిమాట వచ్చేసింది. అతను చిన్నగా, "మెస్సువా! మెస్సువా!" అని పిలిచాడు.

"ఎవరా పిలిచేది?" అన్నదా స్త్రీ, వణుకుతున్న గొంతుతో.

"మరిచి పోయావా?" అన్నాడు మౌగ్లీ. అతని గొంతు ఎండుకు పోయినట్టయింది.

ఆమె తలుపు సగం మూసి, ఇంకో చెయ్యి రొమ్ముకు నొక్కిపెట్టి, "నిజంగా నువే అయితే, నీకు నేనేం పేరుపెట్టానో చెప్పు," అన్నది.

"నత్తూ! ఓరినత్తూ!" అన్నాడు మౌగ్లీ.

"రా, నాయనా, లోపలికి రా," అన్నది మెస్సువా.

అట్ట చివరి బొమ్మ



మౌగ్లీ గుడిసెలోకి అడుగు పెట్టి మెస్సువాను ఎగా దిగా చూశాడు. ఈమె తన మీద ఎంతో ప్రేమ చూపింది ఒకప్పుడు. తాను ఈమెనే ఒకసారి కాపాడాడు. అయితే ఈమె కిప్పుడు జుట్టు నెరుస్తున్నది ; అయినా ఆమె కళ్ళలోనూ, కంఠస్వరంలోనూ మార్పులేదు.

ఆమె కూడా సహజంగా అతనిలో మార్పు ఉంటుందని ఊహించ లేదు. ఆమె అతన్ని నఖ శిఖ పర్యంతమూ పరీక్షించింది. ఇప్పుడతని తల వాకిలి అంత ఎత్తుకున్నది. అతను ఎత్తుకు తగ్గట్టు బలంగానూ, చాలా అందంగానూ ఉన్నాడు. నల్లని అతని జుటు భుజాల మీదికి పడుతున్నది. మెడన అతని కత్తి వేళ్ళాడుతున్నది. తలచుట్టూ మల్లె పూలదండ ఉన్నది. చూస్తే ఏ వనదేవుడో అనిపించేటట్టున్నాడు.

మంచంలో పడుకుని ఉన్న బిడ్డ లేచి గట్టిగా ఏడుపు మొదలెట్టాడు. మెస్సువా వాణ్ణి ఊరుకో బెట్టుతున్నంత సేపూ మౌగ్లీ చుట్టూ ఉన్న వంటపాత్రలనూ, నీటికుండలనూ, మనుషులు ఉపయోగించే ఇతర వస్తువులనూ చూశాడు.

"బాబూ, ఏమన్నా తినటానికీ, తాగటానికీ ఇచ్చేదా? ఇదంతా నీదే. మా ప్రాణాలు కాపాడిన వాడివి! నేను నత్తూ అని పేరు పెట్టింది నీకేనా? లేక నువు ఎవరన్నా దేవుడివా?" అన్నది మెస్సువా.

"నత్తూనే. నేనుండే చోటు నుంచి చాలా దూరం వచ్చేశాను. వెలుగు కనబడింది. ఏమీ ఆలోచించకుండా దగ్గిరికి వచ్చాను. నువ్విక్కడ ఉంటున్నావని నాకు తెలీదు," అన్నాడు మౌగ్లీ.

"మేం ఖాన్హివారాకు వచ్చాక అక్కడ ఇంగ్లీషువాళ్ళు మాకు న్యాయం చేస్తామన్నారు. మమ్మల్ని గ్రామస్థులు దహనం చెయ్యాలని చూశారు. జ్ఞాపకం ఉంది కాదూ?" అన్నది మెస్సువా.

"అదంతా నే నెక్కడ మరిచిపోతాను?" అన్నాడు మౌగ్లీ.

"ఇంగ్లీషువాళ్ళు చట్టాలన్నీ తిరగేసి, ఆ దుర్మార్గుల కోసం వచ్చిచూస్తే మొదలు గ్రామమే లేదు," అన్నది మెస్సువా.

"అదీ నాకు జ్ఞాపకమే," అన్నాడు మౌగ్లీ.

"అందుచేత మా ఆయన ఇక్కడ పొలాలలో పనికి కుదిరి, కష్టపడి పని చేసి కాస్తంత భూమి కూడా సంపాదించు కున్నాడు. ఆ గ్రామపు పొలాలంత మంచి పొలం కాదనుకో. మా కెంత కావాలి? ఇద్దరం ప్రాణులం," అన్నది మెస్సువా.

"ఆయన ఏడీ?" అని మౌగ్లీ అడిగాడు.

"పోయాడు. ఏడాదయింది," అన్నది మెస్సువా.

"వీడు?" అంటూ మౌగ్లీ పిల్లవాణ్ణి చూపాడు.

"నా కొడుకే. రెండేళ్ళ క్రితం పుట్టాడు. నువు వనదేవుడివైతే నీ వాళ్ళ నుంచి వీడికి అపాయం లేకుండా ఆశీర్వదించు," అంటూ మెస్సువా తన చిన్న కొడుకును ఎత్తుకున్నది. ఆ కుర్రవాడు భయంపోయి, మౌగ్లీ మెడలో వేళ్ళాడే కత్తిని పట్టుకోబోయాడు. మౌగ్లీ వాడి బుల్లివేళ్ళను పట్టుకుని, ఎడంగా తోసేశాడు.



"లేదా, పులిపట్టుకు పోయిన నా నత్తూవే అయితే, వీడు నీ చిట్టి తమ్ముడు; వీణ్ణి అన్నగా ఆశీర్వదించు," అన్న దామె, పిల్ల వాణ్ణి మౌగ్లీకిస్తూ.

"అయ్యయ్యో, ఆశీర్వదించటమూ అదీ నా కేం తెలుస్తుంది? నేను దేవుణ్ణీ కాను, వీడి అన్ననూ కాను....చూడమ్మా, నాగుండె ఎందుకో బరువుగా ఉంది," అన్నాడు మౌగ్లీ.

"ఉండదూ మరీ—రాత్రిపూట చెమ్మ నేలల్లో పరిగెత్తితే? జ్వరం పట్టుకుని ఉంటుంది," అన్నది మెస్సువా.

అరణ్యంలో తనకు రోగం వస్తుందన్న ఆలోచనకు మౌగ్లీ నవ్వుకున్నాడు.

"నాయనా, పొయ్యిరాజేసి కాసిని పాలు కాచి ఇస్తా, తాగుదువు గాని. ఆ మల్లెదండ తీసి అవతలపెట్టు. దాని వాసన మహా ఘాటుగా ఉన్నది," అన్నది మెస్సువా.

మౌగ్లీ కూర్చుని ముఖం చేతులలో దాచుకుని ఏదో గొణిగాడు. అతనిలో ఎన్నడూ ఎరగని వింత వికారాలేవేవో చెల రేగుతున్నాయి. తాను విషపదార్థ మేదో తిన్నానన్న భావం వదలటంలేదు. తల నాదు గానూ, పైత్యం చేసినట్టూ ఉన్నది.

అతను మెస్సువా ఇచ్చిన పాలను రెండు గుక్కల్లో తాగేశాడు. మెస్సువా అతన్ని మళ్ళీ మళ్ళీ భుజంతట్టింది. అతను తన పోయినకొడుకు నత్తూ అయినా కాక పోయినా, రక్తమాంసాలు గల మనిషి మటుకు అవును! ఆమెకు అదే సంతోషం.

"నాయనా, నువు అందంగా ఉంటావని ఎవరన్నా నీతో అన్నారా?" అన్నదామె, తన కళ్ళలో గర్వం ప్రదర్శిస్తూ.

మౌగ్లీ తల వెనక్కు తిప్పి తనను తాను చూసుకోవటానికి ప్రయత్నించాడు. మెస్సువా అతన్ని చూసి విరగబడి నవ్వ సాగింది. ఎందుకో తెలీకుండానే మౌగ్లీకూడా గట్టిగా నవ్వాడు. వాళ్ళిద్దరినీ చూసి పసి పిల్లవాడు కూడా నవ్వ నారంభించాడు.

మెస్సువా వాణ్ణి ఎత్తుకుని తన రొమ్ముకు అదుముకుని, "అన్నను చూసి నవ్వొచ్చు నుట్రా? అందులో సగం అందం వచ్చిన నాడు నీకు రాజుగారి చిన్నకూతురి నిచ్చి పెళ్లిచెయ్యమూ, నిన్ను ఏనుగు అంబారీలో ఊరేగించమూ?" అన్నది.

ఆమె మాటల్లో హెచ్చుభాగం అతనికి అర్థంకాలేదు. చాలా దూరం పరిగెత్తాడేమో, ఆ పైన వేడి వేడి పాలు తాగిన ఫలితంగా అతను పడుకుని వెంటనే గాఢ నిద్రలో పడి పోయాడు. మెస్సువా అతని ముఖం మీది వెంట్రుకలను పైకి తోసి, అతని మీద దుప్పటి కప్పి, ఎంతో తృప్తిపడింది.



# 86. ఆఫ్రికా "కల్పవృక్షం"

దీని పేరు బోవాబాబ్. ఈ చెట్టు మీది గుంటలలో నిలిచిన వాననీరు తాగటానికి ఉపయోగిస్తారు. దీని ఆకులు పులుసులో వేస్తారు. దీని బెరడుతో కంటి రోగాలకు చికిత్స చేసే రసాయనం చేస్తారు. కాయలు కూరగా వండుకోవచ్చు. డాకార్ సమీపాన ఉన్న ఈ చెట్టు మొదలు చుట్టుకొలత 65 అడుగులు.



Photo by Vidya Chandra Patwa



బహుమతి
పొందిన వ్యాఖ్య

భయం లేనే లేదు నాకు

పంపినవారు:
బి. బాలకృష్ణ, తెనాలి

 Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

బరు వెంతయినా మోసేస్తా నేను

పంపినవారు:
బి. బాలకృష్ణ, తెనాలి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 మార్చి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: భయం లేనే లేదు నాకు

రెండవ ఫోటో: బరు వెంతయినా మోసేస్తా నేను

పంపినవారు: బి. బాలకృష్ణ,

నాజర్‌పేట, తెనాలి.

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# అమృతాంజనము

## దగ్గు, జలుబులను చప్పున తగ్గించే చల్లని మందు





- అమృతాంజనము ఏ విధంగానూ హాని చేయదు నొప్పి వున్నచోట కొద్దిగా రాస్తే చాలు
- అమృతాంజనము నొప్పిని త్వరగా తగ్గిస్తుంది ఇందులో అత్యంత శక్తివంతమైన పది ఔషధాలున్నాయి
- అమృతాంజనము రాసుకుంటే చల్లగా హాయిగా వుంటుంది. ఇందులో కర్పూరం, మెంథాల్ మొదలైనవి చేరివున్నాయి
- అమృతాంజనము ఖర్చు ఆదా చేస్తుంది ఒక్క సీసా ఎంతో కాలం ఆటివస్తుంది

75 ఏళ్లగా ఇంటింటి దీపమై వెలుగుతోంది

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు బొంబాయి కలకత్తా
న్యూఢిల్లీ హైదరాబాదు




Tel AMR - 12




అర్ధగింప నశక్యమైన రావల్ గావ్ మిఠాయిలు.
అనే కవిధములయిన రుచికరపు సువాసనలు—
నారింజ, నిమ్మ, చాకలెట్, పిప్పరమెంట్.
ఏసమయ మందైనా ఏస్థలమందైనా. వీటిసంతోష.
ముఖములను అనుభ వించండి.

# రావల్‌గావ్

మిఠాయిలు. టాఫీలు లేకో బోన్ బోన్
మరియు పెళల్ కేండీ.

## రావల్ గావ్ నాప్రియమైన మిఠాయిలు.

సోల్ సెల్లింగ్ ఏజంట్లు:

మెసర్స్. మోతిలాల్ గిరిధారిలాల్ అఘార్కర్, మాలేగావ్, నాశిక్ జిల్లా. గ్రేటర్ బొంబాయి, ఢిల్లీ, పంజాబ్, జమ్ము & కాశ్మీర్ ఏజెంట్లు: మెసర్స్. జె. చిత్తరంజన్ అండ్ కో., 3-బి, మంగళదాస్ రోడ్, బొంబాయి-2. ఫోన్: 311236 ★ 864, డాక్టర్. జోషి రోడ్, కరోల్ బాగ్ న్యూఢిల్లీ-5. ఫోన్: 564237 ★ ఉత్తర ప్రదేశ్ సబ్-ఏజెంట్లు: మెసర్స్. పరమానంద్ అండ్ కో., 110/77, ఆర్. కె. నగర్, కాన్పూర్.

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల అకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB® TIT®

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi SC 50 A /67 Tel



మనసులు కలసిన మిత్రులు
దారులు కలవని దృక్పథాలు

మధుపిక్చర్స్

# మంచి మిత్రులు



# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY WE ARE THE BEST

## ONLY WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**

CHANDAMAMA BUILDINGS MADRAS-26

